# Nootana Yogamu (New Yoga) Bhruktha Rahita Taraka Raja Yogamu

NYBRTRY Telugu

మాస్టర్ C.V.V. నమస్కారమ్

గురుదేవ్ V.P.S. నమస్కారమ్

నూతన యోగము (న్యూ యోగ)

భృక్త రహిత తారక రాజయోగము

మీరు మృత్యువును జయించాలనుకుంటున్నారా ?

అయితే ఎట్లా ?

C.V.V.

పైన : మాస్టరు సి.వి.వి., క్రింద : శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

(ఎడమ ప్రక్క : ప్రేయరులో, కుడి ప్రక్క : దగ్గరగా)

# విషయ సూచిక

# 1. మీడియమ్సుకు ఆరిజన్ వార్నింగ్

ఎమ్.టి.ఎ. క్రింద కనుపరచిన సూచనలను మీడియములకు అందరికి ఇచ్చిరి.

మీరంతా ఒక నిశ్చయానికి వచ్చి మీ శరీరంలో జరిగే వర్కింగును గమనించండి.

ఆకలి పుట్టి తగ్గినట్లుగానే చెడ్డకర్మ ప్రతిజన్మలోను కలుస్తూ తగ్గుతూ ఉంటుంది. పూర్వజన్మలోని చెడ్డకర్మలు చెడ్డ ఆలోచనలను కల్గిస్తూంటుంది. అది తొలగిపోతే మీరు బాగుపడడానికి అవకాశం ఉంటుంది.

జరిగిపోయినది-జరిగేది-జరగబోయేది అన్ని సైంటిఫిక్‌గా తెలుస్తాయి ఈ క్రియేషన్‌లోనే. బుద్ధి మూడురకాలు-ఒకటి(మైండ్)బుద్ధి. రెండవది-(ఇంటలెక్చ్యుయల్)వివేకము. మూడవది(ఆస్ట్రల్)సూక్ష్మ శరీరపు బుద్ధి.- వీటి పర్మిషను అవసరము- మొదటి దానివల్ల ''నో'' కాదు అని-రెండవదాని వలన ''యస్'' అవును అని-మూడవ దానివల్ల ''నాట్'' లేదు అనే విషయాలు తెలుస్తాయి.

ముందు మీరంతా నేను చెప్పేది శ్రద్ధగా వినండి. ఎమ్.టి.ఎ. ఇస్తున్నాడని మీరు తలచరాదు. మీరు అట్లా అనుకొంటే మీకు వ్యతిరేక భావాలు తోస్తాయి. మీరు 'ఒన్‌పాయింటు' ఇస్తూ ఉన్నది అనే ధృఢనిశ్చయంతో ఉండాలి. అయితే మీబుద్ధికి అటువంటి ధృఢనిశ్చయము లేదు. అందుచేత అందరూ ధృఢనిశ్చయంతో ఉండండి.

ఈ మానవ శరీరము దృఢమైనదా? ఆస్ట్రల్ శరీరము దృఢమైనదా అని క్రింది భాగంలోను పైభాగంలోను పరీక్షిస్తుండగా పైభాగంలో ఫిజికల్‌బాడి చనిపోయినది కనిపించినది. వెంటనే ఆస్ట్రల్‌బాడి ఎందుకు క్రిందికి దిగి వచ్చింది అని ఆలోచించినాను.

వెంటనే నాకు ఒక బదులు వచ్చింది. ప్రపంచంలోనే ధృఢనిశ్చయము ఎక్కడా లేదు. అందుచేత ఇట్లా జరిగింది అని. తిరిగి అప్పర్ పోర్షన్‌లో చూడ సాగినాను. అట్లా చూడడములో అన్నీ విషయాలు నాకు తెలిసి వచ్చినాయి.

ఇంకా పైకిపైకి వెళ్ళి చూచినాను. అందుకని దారిని ఏర్పాటుచేసి తిరిగి వచ్చినాను. నేను నా మాస్టరుకు బదులు తెలుపాలి. అందుకని తిరిగి వచ్చినాను. నాగురువును రెండు ప్రశ్నలు అడిగినాను. ఆశ్చర్యకరంగా వెంటనే ఒక మంచి పుట్టుకను చూచినాను. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయము. ఇటువంటి ఆశ్చర్యకరమైన విషయాలు మీకండ్లతో మీరూ చూడడానికి మీకూ శక్తిని ఇస్తాను.

ఎవరు ఈ సొసైటీలో చేరడానికి ఇష్టపడతారో వారికి ఎం.టి.ఎ. సూచనలు ఇస్తారు. మైండుకు, ఇంటలెక్చ్యుయల్‌కు, బుద్ధికి అటువంటి శక్తి వచ్చింది. ఇంకా పైపైకి కావలసిన పవర్సు ధృఢనిశ్చయంతో ప్రాక్టీసు చేయడం వలన నేను పొంద గలుగు తున్నాను.

సి.వి.వి. కి మీకు కూడా అన్నీ తెలుపవలెనని ఆజ్ఞ చేసినాను. మీరు అన్నీ తెలుసుకోండి. మీ మాస్టరును మీరు తక్కువగా చూడరాదు. ఆయనను గొప్పవాడుగా గౌరవిస్తేనే మీకు అన్నీ విషయాలు తెలుస్తాయి-సత్యం తెలుస్తుంది.

నేను మీ గురువును మీరు తక్కువగా చూడడానికి మీకు పర్మిషను ఇవ్వలేదు. మీరంతా మీగురువుతో సమానంగా ఉండడానికి గాని-మీ మాస్టరు కంటే పై అంతస్తు లో ఉండడానికి గాని మీకు ఏ విధమైన పర్మిషను నేను ఇవ్వలేదు.

మీ గురువును పై అంతస్తులో ఉంచి పూజిస్తేనే మీకు అభివృద్ధి కలుగుతుంది. లేదా యోగంలో చేరడానికి ముందున్న స్థితికి తిరిగి పతనమైపోతారు. మీరు ఉద్యోగాల్లో గొప్పవారుగా ఉండవచ్చు-యోగంలో కాదు. జాగ్రత్తగా మీ గురువుకు పై అంతస్తును ఇచ్చి పూజించండి. లేదా మీకు పతనము నిశ్చయము. మ.లె. తేది.15-9-1911.

అందుచేత ఎవ్వరూ సి.వి.వి. గారిని తప్ప మిగతా ఎవరినీ "మాస్టరు" అని పిలువరాదు-అచ్చువేయరాదు. అట్లా చెప్పినా-రాసినా రాసిన వాడు వాడి కుటుంబము ఎప్పుడూ తలుపులు తెరిచి ఉండే నరకలోకానికి రాకెట్టు లాగా దూసుకుని వెళ్ళుతారు. తిరిగి మానవజన్మను పొందరు. మాస్టరు సి.వి.వి.గారు ఎదురు చూచిన ఎటర్నటీని ఈ శరీరంతో ఈ జన్మలో పొందలేరు. మోసగాళ్ళు అనర్హులు అయినవారి మాటలునమ్మి అందరిని మాస్టరు అని పిలువకండి-రాయకండి. జాగ్రత్తగా ఉండండి.

మాస్టర్ సి.వి.వి. నమస్కారం
గురుదేవ్ వి.పి.ఎస్. నమస్కారం

# నూతన యోగము (న్యూ యోగ)

# భృక్త రహిత తారక రాజయోగము

## మీరు మృత్యువును జయించాలనుకుంటున్నారా?

## అవును ఎట్లా?

## 2. ఈ న్యూయోగం ఎందుకు?

ఒక అణువు ఈ మానవ శరీర నిర్మాణానికి కారణము. ఆ అణువు అనేక జన్మల నుండి అనేక రకాలయిన పాపాలను మోసుకొని వచ్చి, ఈ జన్మలో వ్యాధులరూపం లోనూ, కష్టాలరూపం లోనూ, బాధిస్తూంది. ఈ కర్మసంబంధ వ్యాధులను డాక్టర్లు తెలుసుకోలేక పోతున్నారు. చికిత్స చేయలేకుండా పోతున్నారు. పేరుకొని పోయిన జన్మజన్మల కర్మను తొలగించడం, కర్మ వ్యాధులను, కష్టాలను తొలగిం చడము, మానవుని చావు నుండి తప్పించడము, ఆపై ఎటర్నటీని సంపాదిం చేటట్లు చేయడము ఈ యోగం యొక్క ముఖ్య ఉద్దేశ్యము.

(చూ.మ.లె.పుట. 100 నుండి 106).

ప్రపంచంలో ఆటమిక్ ఫిజిక్సు అనేది 1941లో, న్యూక్లియర్ ఫిజిక్సు అనేది 1961లో, క్వాంటమ్ ఫిజిక్సు అనేది 1990లో (ఇదంతా సుమారు) వెలుగులోకి వచ్చింది.

అణువును గురించి అమెరికా, జపాన్, జర్మనీ, ఇటలీ దేశాలలో పరిశోధనలు సాగినాయి. అమెరికాకు చెందిన 'రేమండ్ డావిస్ జూనియర్', జపాన్ కు చెందిన 'మసతోషికోషిబలు', 'కార్ల్ సాగెన్', 'ఐన్‌స్టీన్(1921)', 'నీల్స్ బోర్(1922)', 'మాక్స్ ప్లాంక్(1918)' ఇంకా 'రికార్డో జీకోనీ', 'ఆర్థర్ క్లార్కె', 'ఎర్విన్ ష్రడింగర్', 'మాక్సు బోర్ను', 'హైజన్ బర్గు', 'పాల్

డిరక్', 'రిచర్డు ఫైన్‌మెన్' లు కూడా ఉన్నారు. వీరిలో చాలా మంది నోబెల్ బహుమతి గ్రహీతలే. వీరంతా అణువును గురించి పరిశోధించినవారే కానీ, మానవ జన్మకు ఒక అణువు కారణమని చెప్పినట్లు లేదు.

అమెరికా ప్రెసిడెంటు బిల్‌క్లింటన్‌కు సాంకేతిక సలహాదారుడైన డాక్టరు॥కృష్ణ ఆర్.ద్రోణంరాజు 'అణువును చక్కదిద్దితే మృత్యువును జయించి మానవుడు శాశ్వతంగా జీవించగలడు' అని హైదరాబాదులో 16-1-2001 ఈనాడు పత్రిక కు ఇచ్చిన ఇంటర్వ్యూ లో చెప్పినారు. ఇది మాస్టరుగారి రచనలు చూచిన తరువాత చెప్పినారని నా నమ్మకము.

బిల్‌క్లింటన్ 'ఇది మనకే కాదు, మనవాళ్ళకు, ప్రపంచానికి ఉపయోగపడుతుంది' అన్నారు.

ఈమధ్య హైదరాబాదులో 'జెనోమ్ ప్రాజెక్ట్' ప్రారంభోత్సవం లో మన ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు కూడా ఈ విషయాన్ని తెలిపినారు.

మాస్టరు సి.వి.వి.గారు 1910లోనే ''అణువు మానవ జన్మకు కారణము. దానిని చక్కదిద్దితే మానవుడు మరణాన్ని జయించి ఈ రక్త మాంసాదులతో కూడిన శరీరంతో శాశ్వతంగా జీవించగలడు'' అన్నారు. 1910లో మాస్టరుగారు కనుగొని వ్రాసిన విషయాలను 60 సంవత్సరాలకు తరువాత సైంటిస్టులు అణువును చక్కదిద్దితే మానవుడు మరణము నుండి తప్పించుకోగలడు అంటున్నారు. అంతకు ముందు చెప్పినవారు లేరు అనుకొంటాను.

1930 ప్రాంతంలో గవర్నమెంటు వారి లెఖ్ఖల ప్రకారము సగటున మానవుని ఆయుఃప్రమాణము 16 నుండి 30 సంవత్సరాలు అని తెలుస్తోంది. మాస్టరుగారు తమ ''మంత్రాలను విశ్వంలోకి వెదజల్లినాను అవి పనిచేస్తున్నాయి'' అన్నారు. ఆ అమృతవర్షం మానవులకు తెలియ

కుండానే వారిపై పడడంచేత, నేటి మానవుని ఆయుః ప్రమాణం సగటున 60 నుండి 80 దాకా పెరిగింది.

దీనిని బట్టి చూస్తే మాస్టరు సి.వి.వి.గారు 1910 నాటికే ఎంత అభివృద్దిని, సృష్టికర్త నుండి సంపాదించినారో తెలుస్తూంది కదా!

నిజంగా మాస్టరు సి.వి.వి. గారికి నోబెల్ బహుమతి కంటే ఎక్కువే ఇచ్చి ఉండాలి. ఈ విషయాలన్నీ ప్రపంచానికి తెలియకపోవడం చేత ఇవ్వలేదు. మానవులందరూ మృత్యువును జయించాలని మొదట తెలిపిన సి.వి.వి. గారికి తగిన మర్యాద ఇవ్వకపోవడం తప్పే కదా?

మాస్టరుగారి ప్రేమతో మీరంతా అభివృద్దిని పొంది 'ఎటర్నటీ' సంపాదించడానికి అర్హులు అవుతారు; ఎప్పుడంటే క్రమం తప్పకుండా, నిలకడగా, అత్యంతభక్తి తో పది సంవత్సరాలు ప్రార్థన చేసినప్పుడు.

ప్రాచీన యోగాల ద్వారా సంపాదించ లేని అపూర్వ శక్తులు, సిద్ధులు ఈ యోగం చేయడం చేత మీకు కలుగుతాయి. ఇంకా మీరు కలలో కూడా ఊహించనివన్నీ కలుగుతాయి. అదేదంటే ఈ రక్త,మాంసాదులతో కూడిన ఈ శరీరము స్పృహ కోల్పోకుండా, అన్నీ తెలిపి, శరీరం నాశనం కాకుండా చేస్తుంది. అంటే 'ఎటర్నటీ' ఇస్తుంది. (అడ్వైస్ మాస్టర్ సి.వి.వి. 17.12.1917).

మాస్టరు సి.వి.వి. అని ప్రార్థన చేసేవారు, ఆహారం తక్కువగా తిన్నా అతను బలహీనపడడు. అతని శరీరావయవాలన్నీ సక్రమంగా పని చేస్తాయి. అవి క్షీణించేస్థితి లో ఉండవు. 30 సంవత్సరాల వయస్సులో ఉన్నట్లు ఉంటాడు. నిగ్రహంతో ఉంటాడు. అతని ఆలోచనలు సరిగా పనిచేస్తాయి. అతను ఇది కావాలి

<u>అనుకొంటే అది అవుతుంది. అతను అవును అంటే అవును, కాదు అంటే కాదు అనే బదులు మాస్టరుగారి నుండి అతని ద్వారా వస్తుంది. (మూ.డై.పు. 452).</u>

ఈ యోగం ఈ రక్తమాంసాదులతో కూడిన ఈ మానవ శరీరము నశించి పోకుండా ఉండడానికి, నవగ్రహాలకు లోబడకుండా జీవించ డానికి, ఈ స్థూలశరీరం ప్రజ్ఞను కోల్పోకుండా స్పృహలో ఉండగానే ఈ మానవ శరీరంలో రోజూ జరిగే మార్పులను క్రమక్రమంగా తెలుసు కోవడానికి, అన్ని రకాలయిన ఆత్మజ్ఞానాన్ని సంపాదించడానికి ఆరంభింపబడింది.

ఈ సృష్టి రహస్యాలను అంటే ప్రపంచం ఎందుకు పుట్టింది? ఎట్లా పుట్టింది? అనే విషయాలు సులభమయిన రీతిలో, చదువుకొన్న వారికి, చదువుకోని వారికి, ధనికులకు, పేదలకు సంసార జీవితంలో వుండగానే అన్ని విషయాలు తెలిపి రోగాలు, ముసలితనము, చావు లేకుండా సుఖంగా జీవించడానికి, మనకే కాదు, మనతో సన్నిహిత సంబంధం కలవారు కూడా ఈ ఫలాన్ని అనుభవించే దానికి ఈ యోగం ప్రారంభింపబడింది.

ఏ విధమయిన మినహాయింపులు లేకుండా ప్రపంచంలోని అందరు మానవులు తమలో దాగివున్న ఆ భగవంతుణ్ణి కుండలిని లోని దివ్యశక్తి ద్వారా స్పృహలో ఉండగానే దర్శించి, మీలో కలిగే సందేహాలను అంతరాత్మ శక్తి ద్వారా తెలుసుకోవడానికి ఈ యోగము ప్రారంభించబడింది.

(ఇండిపెండెన్స్ డిక్లరేషన్ 1.7.1910).

ఈ యోగంలో 6 రకాలైన కాంట్రాక్టులు పనిచేస్తున్నాయి.

1. అనంతమయిన ప్రాణశక్తిని ఇవ్వడము.
2. స్థూల ప్రజ్ఞలో జీవించి ఉండగానే అనంతమయిన ప్రాణశక్తి నివ్వడము.
3. రక్తమాంసాదులతో కూడిన ఈ శరీరము నశించి పోకుండా

ఉండడము. అంటే చావు లేకుండా వుండడం.

4. రక్తమాంసాదులతో కూడిన ఈ శరీరము మార్పు చెందకుండా ఉండడం.
5. చనిపోయినవారిని సశరీరంగా పిలిపించడము. అంటే రక్త మాంసాదులతో కూడిన శరీరముతో.
6. భూత, వర్తమాన, భవిష్యత్కాలాలలో జరిగే అన్ని విషయాలను గుర్తెరగడము. అంటే మాయను పారద్రోలడము (మాయ అంటే అభివృద్ధిని ఆటంకపరిచే శక్తి). (చ.ఆ.డై.పుట.417తే. 30.11.1920)

## 3. న్యూయోగమంటే ఏమి?

భక్తి, శ్రద్ధ, విశ్వాసము, అతి జాగ్రత్తతో రూల్సు-రెగ్యులేషన్సు ను పాటిస్తూ ఏకాగ్రతతో అంతరాత్మపరిశీలన చేస్తూ ప్రార్థన చేసేవాళ్ళకు శాశ్వతత్వాన్ని ప్రసాదిస్తుంది ఈ యోగము.

మాస్టరు సి.వి.వి. గారు 01.07.1917 న యోగమంటే ఏమి? అనేదానికి వివరణ ఇచ్చినారు. ''యోగమంటే ఒకవిధమయిన ఇన్నర్ డెవలప్‌మెంట్(ఒక రకమయిన అంతరాత్మ అభివృద్ధి) అదే మెడిటేషన్ అంటే ధ్యానము. ధ్యానముతో చురుకుదనమయిన అభివృద్ధి కలుగుతుంది'' అని.

సృష్టికర్త ఈ యోగానికి భృక్త రహిత తారక రాజయోగం అని పేరు పెట్టి నారు. 'భృక్త' మంటే మరుగయినది, కంటికి కానరానిది-అదేదంటే పూర్వజన్మ కర్మ. రహిత మంటే తొలగించడము. తారక అంటే శ్రేష్ఠమయిన, రాజయోగము అంటే సన్యాసి కాకుండా గృహస్థాశ్రమము లోనే ఉంటూ ఈ యోగాన్ని అభ్యసించడము.

ప్రాచీనకాలంలో 64 యోగాలు ఉండేవి. ఇది 65 వ యోగ మన్నారు. 65 వ యోగము కాబట్టి ఈ యోగానికి న్యూయోగ అని పేరు పెట్టినారు. ఈ యోగానికి సంబంధించిన అన్ని విషయాలు సైంటిఫిక్ గా అంటే

శాస్త్రోక్తముగా తెలుపడముచేత ఈ యోగానికి సైంటిఫిక్ యోగ మని కూడా పేరు పెట్టినారు. (చూ. ఇండిపెండెన్సు డిక్లరేషన్ తేది 1.7.1910 ఇంకా మహాత్మా లెటర్సు వాల్యూములు 1-3.) ఇంకా ఈ యోగము కుండలిని యోగ మనీ, ప్రాక్టికల్ యోగమనీ, పతంజలియోగ మైన అష్టాంగయోగ మనీ కూడా పేర్కొన బడింది.

జననకాలంలో ప్రాణశక్తి(స్టెబిలిటీ) శరీరంలో వాయురూపంలో ప్రవేశిస్తుంది. ఆ వాయువు శరీరంలో ఉన్నంత వరకు మానవుడు బ్రతికి ఉంటాడు. ప్రాణవాయువు శరీరాన్ని వదలి వెళ్ళితే చావు సంభవిస్తుంది. ప్రాణవాయువు శరీరంలోని నరాల ద్వారా తిరుగుతూ ఉంటుంది. ఇప్పుడు మానవులకు ఉన్న నరాలు చిట్లిపోయేవి. అవి చిట్లిపోవడం చేతనే చావు సంభవిస్తూంది.

అయితే ఈ ప్రార్థన చేసేవారికి ఇప్పుడున్న నరాల మధ్యభాగంలో ట్యూబులాగ తయారు అవుతుంది. ఈ ట్యూబు చిట్లిపోయేది కాదు. ఈ ట్యూబు తయారు అయిన తరువాత, ట్యూబు చిట్లిపోదు కాబట్టి ప్రాణవాయువు బయటికి వెళ్ళకుండా శరీరంలోనే తిరుగుతూ ఉంటుంది. అప్పుడు ఈ శరీరం ఏవిధమైన మార్పు చెందకుండా శాశ్వతంగా అంటే ఎటర్నల్‌గా ఉంటుంది.

## 4. న్యూయోగాన్ని ఎవరు ఆరంభించినారు?

కుంభకోణంలో శ్రీ కంచుపాటి వెంకట్రావు వెంకాసామిరావు గారనే ఆయన ఈ యోగాన్ని ఆరంభించినారు. వీరి పూర్వులు కృష్ణా జిల్లా నుండి తంజావూరి సంస్థానానికి వచ్చి చేరినారు. కుంభకోణము లోనూ, శ్రీరంగం లోనూ నివసించినారు. 04.08.1868 మంగళ వారము ఉ॥10గం॥20 నిమిషాలకు ధనిష్ఠా నక్షత్రం రెండవ పాదం కన్యాలగ్నం లో సి.వి.వి. గారు జన్మించినారు.

15000 వేల సంవత్సరాల నుండి సి.వి.వి. గారి జన్మకు కారణమయిన అణువు మృత్యువును జయించాలని ప్రయత్నిస్తూ వచ్చింది. దీనిని చూచిన సృష్టికర్త కడపట ఈ జన్మలో ఎట్లాచేస్తే మృత్యువు ను జయించవచ్చునో తెలుసుకొడానికి సి.వి.వి. గారి వద్దకు ఎమ్.టి.ఎ. అనే మహాత్ముని పంపింది. ఆ తర్వాత కొద్దిరోజులకే వెంకాసామిరావు గారిని మాస్టర్ సి.వి.వి. గా పిలవనారంభించినారు.

మాస్టరుగారు 1910లోనే ప్రపంచంలో 4448 వ్యాధులున్నాయని కనుగొన్నారు. ఈనాటివరకు మెడికల్ ప్రపంచంలో ఇన్ని రోగాలున్నాయని తెలుసుకోలేదు. మాస్టరు సి.వి.వి. గారు 13.8.1915 లో కాన్సర్ ను ఈ యోగం ద్వారా నయము చేసినారు. కాన్సరన్న పదం ఆనాటికి ఆంగ్లవైద్య ప్రపంచానికి తెలియదు. 8.12.1910 లో మానవ శరీరాన్ని స్కాన్ చేసి చూచినారు. 'స్కాన్' అన్న పదం ఆంగ్లవైద్యులకు 1970 ప్రాంతంలో తెలిసింది. నాలుగు సందర్భాలలో మృత్యువును జయించినారు. కంటికి సంబంధించిన ఒక విచిత్రమయిన 'బోల్తాకాషన్ ఐ' అనే వ్యాధిని కనుగొన్నారు. ఆ వ్యాధిలోని ఒక భాగాన్ని కోటిభాగాలు చేసి, ఆ కోటిలో ఒక భాగాన్ని తీసి, దానిని మరల కోటిభాగాలు చేసి, అందులోని ఒక భాగానికి చికిత్స చేసినారు. ఈ విషయాన్ని గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రి కంటి వైద్యులను, తిరుపతి రుయా ఆసుపత్రి కంటి వైద్యులను సంప్రదించగా 'ఇప్పటిలో మేమేమీ చెప్పలేము. సాధ్యం కాదు చెప్పడానికి. ఇంత సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించి కంటికి వైద్యం చేయడానికి ఆంగ్ల వైద్యులకు ఇంకా 20 సంవత్సరాలు పట్టవచ్చు' అన్నారు.

పొత్తి కడుపులో పూర్వజన్మ కర్మలన్నీ దాగి ఉంటాయి. వ్యాధుల రూపంలో బాధిస్తాయి. ఇడ, పింగళ నాడుల ద్వారా దానిని కదిలిస్తే 'ఒన్ పాయింట్' సహాయంతో వ్యాధులు చక్క బడతాయి. 'ఐసైట్'తో శరీరంలోని మార్పులను గమనించేది. పుట్టుకలో 'ఊంబు'లోని బలహీన నరం వల్ల వ్యాధి ఏర్పడింది.

రహస్యంగా గమనించేది. ఇది అతి రహస్యము. M.L-210.

కాస్మిక్ పవర్‌తో ట్రీట్‌మెంటు చేసి విగర్ సప్లై చేయవచ్చు (కర్మ వ్యాధులు నయం చేయవచ్చు అని అర్థం). ఇంకా రక్తం కూడా ఉత్పత్తి అయ్యేటట్లు చేయవచ్చు. ఇది రహస్యంగా సాధించే విషయము. M.L.212.

30-8-1910లో మాస్టర్ సి.వి.వి. గారు కాస్మిక్ పవర్ తో ట్రీట్‌మెంట్ చేసినారు. ఆ తరువాత 4 సంవత్సరాలకు 'ఉసూయి' రేఖి ఆరంభించినట్లు తెలుస్తూంది. రేఖికి మూలకారకులు మాస్టరుగారు అని దీనివల్ల తెలుస్తూంది.

'డాక్టర్ మికోవ్ ఉసూయి' కాస్మిక్ పవర్‌తో ఏప్రిల్ 1921న HARAJUKU, AOYAMA IN TOKYO లో ట్రీట్‌మెంటు ప్రారంభించినారు. ఇతను 9-3-1926లో చనిపోయినాడు.(చూ. మార్టిన్ నజారెడ్ రచించిన ''రేఖి'' పుట.9) 1915లో ఆరంభించినాడు అని కొందరు అంటున్నారు. రేఖి కూడ కర్మ వ్యాధులను తొలగించడానికేనని తెలుస్తూంది. ఉసూయి భారతదేశానికి, టిబెట్టుకు వచ్చి సంస్కృతాన్ని నేర్చుకున్నాడు.(రేఖి సుమిత్ శర్మ.17 పుట)

ది ఒరిజినల్ రేఖి హాండ్ బుక్ ఆఫ్ డాక్టర్ మికావొ ఉసూయి పేజి.26 లో క్రింది విధంగా ఉన్నది.

నా పాత స్నేహితుడు రేఖి టీచరు AGEHANAND POPAD నాతో ఇట్లా చెప్పినాడు ''ఒక భారతీయ ఫైడ్ హీలరు ఇదే రకమైన ప్రక్రియతో నాకు ట్రీట్‌మెంటు ఇచ్చినాడు'' అని. ఆ భారతీయుడు మాస్టరు సి.వి.వి. గారేనని నా అభిప్రాయము.

మాస్టరుగారు 20-8-1917 లో పిల్లర్‌టెస్టు లో ఈవిధంగా చెప్పినారు.

''50 మందికి జ్వరం గాని దగ్గు గాని వస్తే వారికి అందరికి ఒకే మందు

ఇస్తే జ్వరము దగ్గ తగ్గదు.నవగ్రహాలు ఈ శరీరానికి–ఈథరిక్ బాడికి–ఆస్ట్రల్ బాడికి–మెంటల్–రూప ప్లేన్లకు బాధ కల్గిస్తుంది. కాబట్టి ఆయా సూక్ష్మకణాలకు తగినవిధంగా ట్రీట్ చేస్తే తగ్గుతుంది'' అన్నారు. పూర్వజన్మ కర్మఫల ఘనతను బట్టి ట్రీట్ చేయవలెను అన్నారు.

ఇప్పుడు 30-6-2003 వ తేదీన ఆంధ్రజ్యోతి లో ''ఇక మనిషికో మందు సాధ్యమే'' అనే శీర్షిక క్రింద ఒక వ్యాసం ప్రకటింప బడింది. మాస్టరుగారు చెప్పిన 86 సంవత్సరాలకు తరువాత ''స్విట్జర్ లాండ్ లోని ఒక ప్రముఖ మందుల కంపెని ''రోచే'' సిలికాన్ అనే వస్తువుతో తయారు చేసి విడుదల చేసిన జన్యు చిప్పులతో ఔషధాలతో పాటు, ఔషధ మోతాదులు నిర్ణయించి ఒక మనిషికి ఒక రకమైన మందు ద్వారా రోగం నయం చేయవచ్చు'' అన్నారు.

మాస్టరుగారి సాహిత్యం 1997 నుండి ప్రకటింప బడింది. ఇంటర్‌నెట్ లో మాస్టరుగారి సాహిత్యం వస్తూ వుంది. అన్ని దేశాల వాళ్ళు కుంభకోణం వచ్చి మాస్టరుగారి రూములో ప్రార్థించి సాహిత్యాన్ని కొన్నారు. కాబట్టి మాస్టరుగారి సాహిత్య ఆధారంగా ఇవన్నీ ప్రపంచానికి తెలియ వస్తున్నాయని నా అభిప్రాయము.

## 5. ఎప్పుడు ఈ యోగం ఆరంభింపబడింది?

దక్షిణ భారతదేశంలోని కుంభకోణం అనే వూరిలో కీళ్ డబీర్ తెరు (తూర్పు డబీరు వీధి) పాత నెం.64, క్రొత్త నెం.65వ ఇంటిలో సుమారు 1900 వ సంవత్సరములో ప్రారంభించినారు. తాను ప్రాక్టీసు చేసి, కొంత అభి వృద్ధిని పొందిన తర్వాత 30.5.1910వ తేది రాత్రి 8గం॥ 30నిమిషాలకు సృష్టికర్త తో సి.వి.వి. గారికి సంబంధం ఏర్పడెను. అందుచేత ఆ రోజును 'లింక్ విత్ ఆరిజన్ డే' అన్నారు సి.వి.వి. గారు. చూ.డై.1918. –ఇం.ఈ.

## 6. ఎందుకు ఈ యోగం కుంభకోణం లోనే

ఆరంభింప బడింది?

రాక్షసులు, దేవతలు క్షీర సాగరాన్ని మథించినారు. అందులో అమృతము లభించింది. ఆ అమృతాన్ని త్రాగిన వారికి చావు లేదు. ఆ అమృత భాండాన్ని కుంభకోణంలోని కుంభేశ్వరస్వామి దేవాలయమును నిర్మించేటప్పుడు క్రింది భాగంలో ఉంచి దానిపై దేవాలయమును నిర్మించినారని టెంపుల్‌సిటి చరిత్ర తెలుపుతూంది. అందుకనే ఆ వూరికి కుంభకోణం అనే పేరు వచ్చింది. చావును తప్పించాలనే సంకల్పంతో ఇక్కడ ఈ యోగమును ప్రారంభించినారు. అదే మాస్టరు సి.వి.వి. గారి ''భృక్త రహిత తారక రాజయోగము''.

## 7. ప్రార్థన(ప్రాక్టీసు) చేయడానికి పద్ధతి ఏమి?

మీరు ముఖ్యముగా చేయవలసినది-మీ శరీరములో ఏమి జరుగుచున్నది? ఎక్కడ జరుగుతున్నది? అనే దానిని ఏకాగ్రతతో రోజూ గమనించాలి. సాధకుడు అతనికి సౌకర్యంగా ఉన్న విధంగా కూర్చోవాలి. స్నానము, అల్పాహారము, కాఫీ వగైరాలు సేవించి కూర్చోవాలి.

(అ) వేరేవిధమైన పూజలు వగైరాలు ఈ యోగం చేసేవారు చేయరాదు.

(ఆ) ఇతర మంత్రాలను ఉచ్ఛరించరాదు.

(ఇ) 45 నిమిషాలు విధిగా ప్రార్థన చేయాలి.

(ఈ) రోజుకు 3 పర్యాయాలు ప్రార్థన చేయాలి.

ఉదయము 4గం॥ నుండి 8గం॥ లోగా ఒక పర్యాయము. సాయంత్రం 6గం॥ నుండి 8గం॥ లోగా 2.వ. పర్యాయము. రాత్రి పడుకోబోయేటప్పుడు ఒక పర్యాయము. రాత్రి ప్రార్థనా సమయంలో తెల్లవారి నుండి మనం చేసిన పనులను నెమరు వేసుకొని సత్యానికి, ధర్మానికి వ్యతిరేకంగా ఏవైనా చేసివుంటే ఆ విషయాలు మాస్టరు సి.వి.వి. గారికి విన్నవించి క్షమించమని, ఇకపై తప్పులు చేయకుండా చక్కదిద్దమని ప్రార్థించాలి. ఆయన క్షమించి చక్కదిద్దుతారు. స్థానిక కాలమానం ప్రకారము ప్రార్థన చేసేది.

(ఉ) ఉదయం 4 గం॥ నుండి సాయంత్రం 4 గం॥ వరకు సూర్యుడు లోకాన్ని పరిపాలిస్తాడు.

(ఊ) సాయంత్రం 4 గం॥ నుండి ఉదయం 4 గం॥ వరకు చంద్రుడు లోకాన్ని పరిపాలిస్తాడు.

(ఋ) ఒకసారి ప్రార్థన ఒక జన్మ కర్మను తొలగిస్తుంది.

(ఎ) రూల్సును, రెగ్యులేషన్సును అతిక్రమించకుండా కనీసం పది సంవత్సరాలు ప్రాక్టీసు చేస్తే రోగాలు, ముసలితనము లేకుండా శాశ్వతంగా జీవించే శక్తి వస్తుంది.(చూ. మాస్టరుగారి మొత్తం సాహిత్యం).

## 8. నేను ఎక్కడ ప్రార్థన చేయాలి?

1. ఇక్కడ చెప్పబడిన ప్రదేశాలు అంటే పూలుపూసే తోట-చక్కటి రూము, ఇవి చక్కగా ఉండాలి. మంచి సువాసనను వెదజల్లేది గా ఉండాలి. ఈ రెండింటిలో ఏది మీకు సౌకర్యంగా ఉంటుందో దానిని ఎన్నుకోండి. (మ. లె. పు. 28)
2. పరిశుభ్రంగా లేని ప్రదేశాలలోను-ఆర్ద్రమైన హృదయుము లేనివారు-సభ్యత లేనివారు ఉండేచోట-భగవంతుని మీద నమ్మకము లేనివారు ఉన్నచోట ప్రార్థన చేయ రాదు. ప్రార్థనా మందిరాన్ని అతిజాగ్రత్తతో పరిశుభ్రంగా, అందంగా ఉంచాలి. అతిగా సువాసనలు ఉండరాదు. తేలికపాటి సువాసన ఉండాలి. అప్పుడే ఆ రూములో నుండి 'ఆరా' ఉత్పత్తి అవుతుంది. ఆ 'ఆరా' జీర్ణపుకాని వానిని జీర్ణము అయ్యేటట్లు చేస్తుంది. అంటే పూర్వజన్మల పాపకర్మలను, వ్యాధులను, కష్టాలను తొలగిస్తుంది అన్నమాట. ఆ రూములో ఎటువంటి శబ్దాలు లేకుండా చూచుకోవాలి.

ప్రత్యేకంగా చెబుతున్నాను. ప్రార్థనా సమయంలో ఏవిధమైన శబ్దము ఉండరాదు. (మ. లె. పు. 3)

3. ప్రార్థన రూము ఎంత శుభ్రంగా ఉంచడానికి వీలవుతుందో అంత శుభ్రంగా ఉంచాలి. అప్పుడే 'ఆరా' పుట్టుతుంది. ఆ 'ఆరా' పూర్వ జన్మ కర్మలను, వ్యాధులను, కష్టాలను మూడువేల నాలుగు వందల తొమ్మిది పాయింట్లు 5 నాట్సు బై 9(3409.5/9)తొలగిస్తుంది. (మ. లె. పు. 289)
4. తాగుబోతులు, చుట్ట–బీడి తాగేవారు ఇంకా దురలవాట్లు కలవారు బాగుపడాలి అనుకుంటే అట్టివారిని కూడా 'ఆరా' గల రూము లోనికి రమ్మని, రూల్సు–రెగ్యులేషన్సు ప్రకారం ప్రార్థన చేయమని చెప్పేది. ఆ విధంగాచేస్తే వారి శరీరంలో శక్తి ప్రవేశించి, వారు అభివృద్ధి పొందుతారు. అది వారికి తెలుస్తుంది. (మ. లె. పు. 423)
5. నా రూల్సు–రెగ్యులేషన్సు ప్రకారము ప్రార్థించే వారిని చూడగానే వర్చస్సుతో చక్కగా కనిపిస్తారు. ఈ యోగంలోనికి రావడానికి ముందు మీకు ఈ వర్చస్సు ఉండేదా? నాకు తెలపండి. నేను సంతోషిస్తాను. మీ 'ఆరా' కే వదిలి వేస్తాను. (మ. లె. పు. 547)
6. అతితక్కువ వెలుతురు గల రూములో ప్రార్థన చేయాలి. అప్పుడే మీరు ఎన్నో అపూర్వమైన విషయాలను ప్రత్యక్షంగా చూడగలరు. వెలుతురులో ప్రార్థిస్తే, మీరు అపూర్వ విషయాలు చూడలేరు. అందుచేత అతితక్కువ వెలుతురు గల రూము ఎన్నుకోవడ మైనది. (మ.లె. పు.174)

ప్రార్థన ఉత్తనేలపై కూర్చుండి చేయరాదు. చాపమీద కానీ, జముకాణము పైన గానీ, ఇంక దేనిపైన గానీ కూర్చుండి చేయ వలయును. ఇనుము పై కూర్చుండరాదు.

## 9. న్యూయోగాను ఎట్లా ప్రాక్టీసు చేయాలి?

నీవు పదిసంవత్సరాలు క్రమం తప్పకుండా ప్రాక్టీసు చేస్తానని నిర్ణయించుకొని, మాస్టరు గారి రూల్సు–రెగ్యులేషన్సును పూర్తిగా

పాటించి, అభివృద్ధిని పొందిన వారివద్ద ఉపదేశము పొంది, ప్రార్థన చేయాలి. మాస్టరుగారిచ్చిన రూల్సు–రెగ్యులేషన్సు ప్రకారం ఒక నిర్ణయంతో ప్రార్థనకు కూర్చుని అంతరాత్మ పరిశీలన చేయాలి.

వెబ్‌సైట్‌లోని ప్రార్థన ద్వారా మీకు ఏ విధమైన అభివృద్ధి కలుగకపోతే ఈమెయిల్ ద్వారా క్రిందివారిని సంప్రదించండి.

e-mail:-avsacharyulu@mastercvv.org,
avsacharyulu@rediffmail.com,
webmaster@mastercvv.org.

వాళ్ళు మీ అభివృద్ధికి మార్గాలు తెలుపుతారు.

1. ప్రార్థన చేయడానికి 15 నిమిషాలు ముందుగా వచ్చి కూర్చోవాలి. కూర్చొని గానీ, పడుకొని గానీ మీ సౌకర్యం ప్రకారం ప్రార్థించేది. రాగానే మాస్టరు సి.వి.వి. గారి ఫోటోను తదేక ధ్యానంతో చూస్తూ సమయము రాగానే ప్రార్థన ప్రారంభించేది. ఫోటో లేనట్లయితే 15 నిమిషాలు మనసులో ఏ విధమయిన ఆలోచనలు పెట్టుకోకుండా, ప్రశాంతంగా కూర్చోండి. ఆ తర్వాత ప్రార్థించండి. (డై. పుట.135)

(ఈ క్రింది విధంగా మనసులో ఒకే పర్యాయము స్మరించండి. పదే, పదే స్మరించకండి. బిగ్గరగా ఉచ్చరించకండి)

సత్సంకల్పంతో ఈవిధంగా ప్రార్థించండి.

ప్రార్థన

## <u>మాస్టర్ సి.వి.వి. నమస్కారము.</u>

(మీ సంకల్పం ఇలా ఉండాలి.)

నేను, ఈ ప్రపంచమూ సుఖంగా ఉండాలి. పూర్వజన్మ కర్మ, ఈ జన్మ కర్మ తొలగి పోవాలి. నా ఈ జన్మకు ఒక అణువు కారణము. ఆ అణువు ఎన్నో

జన్మల నుండి ఎన్నో పాపాలు మోసుకొని వచ్చి, ఈ జన్మలో కష్టాలు, రోగాలు కల్గిస్తూంది. ఆ అణువు లోని దోషాన్ని తొలగించి, నాకు వెంటనే స్వస్థత చేకూర్చాలి. రక్తమాంసాదులతో కూడిన ఈ శరీరంతోనే నేను ఎటర్నటీని మరుజన్మలో కాదు, ఈ జన్మ లోనే పొందేటట్లు అనుగ్రహించమని ప్రార్థిస్తున్నాను.

మాస్టరుగారూ! మీరు సశరీరంగా వెలసి, ఎటర్నటీని ఈ భూమిపై నెలకొల్పాలని ప్రార్థిస్తున్నాను. నమస్కారమ్.

<u>గమనిక:</u>

ఎవరైనా బలహీనంగా ఉన్నా, వ్యాధులతో బాధపడుతూ ఉన్నా, పడుకొని ఈ క్రింది విధంగా ప్రార్థించండి.

1. మీకున్న వ్యాధులనన్నింటినీ మాస్టరు గారికి విన్నవించి వెంటనే నివారణ కావాలని ప్రార్థించండి.
2. ఎవరైనా బలహీనంగా ఉంటే పడుకుని 'మాస్టరుగారూ! నాకు ప్లంటి ఆఫ్ ప్రాణ సప్లై ఇంకా 'విగర్ సప్లై' ప్రసాదించండి' అని ప్రార్థించండి.

## 10. అంతరాత్మ పరిశీలన ఎట్లా చేయాలి?

1. ఒక దివ్యమైన శక్తి మీ తలపై తాకుతుంది, అక్కడ నుండి తలచుట్టూ తిరిగి, కళ్ళలో చేరుతుంది. అక్కడ నుండి కుడిచేతి వేళ్ళ కొస వరకు వెళ్ళి, పైకి తిరిగి వచ్చి-ఎడమ చేతి కొస వేళ్ళ వరకు వెళ్ళి, పైకి తిరిగి వచ్చి, హార్టును-లంగ్సును తాకి, ఆహారనాళం గుండా కుండలిని లోనికి ప్రవేశిస్తుంది. ఈ కుండలిని అనేది మూత్ర కోశానికి, పురీషకోశానికి

మధ్య సూక్ష్మాతి-సూక్ష్మమైన అణువుగా వుంటుంది. ఈ ప్రక్రియ అంతా నరాల ద్వారా జరుగుతుంది. సూక్ష్మాతిసూక్ష్మమైన కదలికలు కలిగి ఉంటుంది ఈ ప్రక్రియ. దీనిని మనము అతిజాగ్రత్తగా గమనించాలి. కుండలిని లో నుండి వచ్చే శక్తి ప్రాక్టీసు చేసేవాడు తట్టుకునేటంత కదలికలను కలిగిస్తుంది. అక్కడ నుండి ఆ శక్తి భగవంతుడు శక్తిని ఉపయోగించినట్లు పనిచేస్తుంది. ఎట్లా అంతరాత్మ పరిశీలన చేయాలో మహాత్మా మాస్టరు సి.వి.వి గారికి తెలిపినారు. (చూ. డై. పు. 354,355,414).

2. ప్రాక్టీసు చేసేటపుడు క్రింది ప్రదేశాల్లో కూడా గమనించండి.

అ. తల-కనుబొమలు-తలచుట్టూ-కన్నులు-గడ్డము-మెడ-భుజాలు-గుండె -పొట్ట-ఆహార నాళము-కిడ్నీలు-వెన్నుపూస-పురుషాంగము-బీజాలలో సూక్ష్మాతిసూక్ష్మం గా జరిగే ప్రక్రియను గమనించేది .

ఆ. తలపైన-తలక్రింద ఇంటలెక్చుభాగం-హార్టు-బొడ్డు-కడుపు-బీజాలలో గమనించాలి.

## 11. ప్రార్థన ప్రారంభించగానే ఏమి జరుగుతుంది?

మాస్టరుగారి రూల్సు-రెగ్యులేషన్సు ప్రకారం ప్రార్థన ప్రారంభిస్తే వెంటనే శరీరమంతా ఒక కుదుపు కుదిపినట్లు అవుతుంది. ఆ తర్వాత శరీరంలో వైబ్రేషన్సు తెలుస్తాయి. మాస్టరుగారు 30000 రకాల వైబ్రేషన్సు ఉన్నాయన్నారు. అందులో ఏదో ఒకటి మీకు రావచ్చు. ఎన్నోరకాల శరీర భంగిమలు రావచ్చు. ఒక్కొక్కప్పుడు షాక్ కొట్టినట్లు ఉంటుంది. కొంతమందికి ఇప్పుడు జరిగేవి, జరిగినవి, జరగబోయేవి (సినిమాలాగా) కంటికి కనిపిస్తాయి. కొన్ని సూచనలు సింబాలిక్‌గా తెలుస్తాయి. పరిపూర్ణ విశ్వాసంతో, ఏకాగ్రతతో, క్రమం తప్పకుండా ప్రార్థిస్తే, మంచి స్పృహలో ఉండగానే పై విషయాలన్నీ తెలుస్తాయి.

ఇతర యోగాలలో అత్యున్నతమైనది సమాధిస్థితి. ఆ స్థితికి చేరిన సాధకుడు స్పృహను కోల్పోతాడు. ఆ సమయంలో అతని శరీరంలో గానీ, అతని అభివృద్ధిలో గానీ ఏమి జరిగింది? అతనికి తెలియదు. స్పృహ వచ్చిన తరువాత ఏమి జరిగింది చెప్పలేడు.

అదే సమాధిస్థితి ఈ యోగంలో కల్గిన సాధకుడు స్పృహ కోల్పో కుండా తను ప్రత్యక్షంగా అన్నీ చూడగలుగుతాడు-తెలుసుకున్నవన్నీ చెప్పగలడు. అదే ఈ యోగంలో ఉన్న గొప్పతనము. నీకు సంపూర్ణ విశ్వాసం ఉంటే అన్ని వ్యాధులు, బాధలు తొలగి పోతాయి. నీవు అభివృద్ధి పొందినావు అనడానికి గుర్తు నీవు కష్టాల నుండి, బాధల నుండి తప్పించు కోవడమే. మాస్టరు సి.వి.వి. గారు 'ప్రాక్టీసు మానవుని చక్క చేస్తుంది' అన్నారు.

ప్రార్థన చేయకుండానే చేసినాను అని అబద్ధాలు చెప్పకుండా క్రమం తప్పకుండా అత్యంత విశ్వాసంతో-పరిశుద్ధమైన మనస్సుతో ప్రార్థన చేయాలి. ఒక్కొక్కప్పుడు ఉన్నట్లుండి కొందరికి వారు పూర్వజన్మలో చేసిన యోగఫలం వల్ల వెంటనే అభివృద్ధి కలుగుతుంది.

## 12. ఈ యోగం ఎవరు చేయవచ్చు?

మాస్టరుగారి ఆశయం ప్రకారము ఈ యోగం ప్రపంచంలోని మానవులంతా ఏ జాతివారైనా జాతి, కుల, మత విచక్షణ లేకుండా అందరూ చేయడానికి అర్హులే. 10 సంవత్సరాలు తప్పక ప్రాక్టీసు చేస్తానని నిర్ణయించుకుని చేయాలి.

ఈ క్రిందివారు ఈ యోగం చేయడానికి అనర్హులు.

1. మాంసాహారి, త్రాగుబోతు, చుట్ట-బీడి-సిగరెట్టు ఇంకా ఉద్రేకాన్ని కల్గించేపదార్థాలు సేవించేవాడు, శీలము లేనివాడు-దుర్మార్గుడు-పరిహాసంగా మాట్లాడేవాడు-

విశ్వాసహీనుడు-దొంగాటలాడు వాడు-సంస్కారము లేనివాడు-ఇతరుల అభివృద్ధిని ఓర్వలేనివాడు-తప్పుడు పనులు చేసేవాడు-చపల చిత్తుడు-ఉద్రేకపరుడు-కోపం కలవాడు-అహంకారము కలవాడు-సందేహ ప్రాణి-క్షణికోద్రేకి-పగ సాధించాలి అనేవాడు-అధర్మపరుడు-తానే గొప్ప అని గొప్పలు చెప్పుకొనేవాడు-వీళ్ళు ఈ యోగం చేయడానికి అనర్హులు(చూ. డైరి-మ.లె.పుట. 180 ఇంకా చాలాచోట్ల)

## 13. రుసుము ఏదైనా చెల్లించవలెనా?

1. ఇనిసియేషనుకు ఫీజు లేదు.
2. సబ్‌స్క్రిప్షన్ లేదు.
3. ట్రీటుమెంటు ఉచితము. ఫీజు లేదు.

(అన్నిరకాల వ్యాధులకు-ప్రయోగాలకు-భూత,ప్రేత, పిశాచాలకు)

## 14. ఈ యోగానికి రూల్సు ఏమి?

1. 12 సంవత్సరములకు పైబడి ఉండాలి. (ట్రీటుమెంటుకు ఇది వర్తించదు).
2. తల్లిదండ్రులపై ఆధారపడిన వారికి తల్లిదండ్రుల పర్మిషను అవసరము.
3. వివాహమయిన స్త్రీలు భర్త అనుమతి పొంది రావాలి.
4. భర్త వదలిన స్త్రీ, అతనితో తిరిగి సంసారము చేసి సుఖ, సంతోషాలతో వర్ధిల్లాలనే సత్సంకల్పం గలది అయితే వచ్చి ప్రార్థించవచ్చు.
5. పెండ్లికాని స్త్రీలకు తల్లిదండ్రుల పర్మిషన్ గానీ, సంరక్షణకర్తల పర్మిషన్‌గానీ అవసరము.
6. దివాలాకోరుగా ఉండరాదు.
7. చీకాకులు లేకుండా ఉండాలి. (చీకాకులు తొలగాలని వచ్చి ప్రార్థించ

వచ్చు.)

8. ఇతరులు వేలెత్తిచూపే ప్రవర్తన పనికిరాదు.

ఎ. పది సంవత్సరాలు ప్రాక్టీసు చేస్తాననే నిర్ణయంతో రావలి.

బి. ప్రాణాయామము చేయరాదు.

సి. బీజాక్షరాలు పఠించరాదు.

డి. గాయత్రి మంత్రం చేయవచ్చును.

ఇ. పూజలు వగైరాలు ఏవీ చేయరాదు.

ఎఫ్. ఓం అనే దానిని ఉచ్చరించరాదు-వేరే మంత్రాలు జపించరాదు.

జి. బ్రహ్మ-శివుడు-విష్ణువులతో సంబంధం పెట్టరాదు.

## 15. అభివృద్ధిని తెలుసుకోవడం ఎట్లా?

నీ అభివృద్ధి నీవు కోరే కోరికలపైన ఆధారపడి వుంటుంది. నీవు 100 కోరినావు. అందులో 10 మాత్రమే ఫలించినాయి. అంటే 10% మాత్రమే అభివృద్ధి పొందినట్లు. 90 ఫలిస్తే 90% అభివృద్ధి పొందినట్లు. నూటికి నూరుపాళ్ళు అభివృద్ధి పొందడానికి ప్రయత్నించాలి. అభివృద్ధి పొందాలి.

1. నీవు క్రమ,క్రమంగా అభివృద్ధి పొందినావు అనే విషయము ఎట్లా తెలుస్తుంది-అంటే నీ మనస్సుకు తోచినవి తప్పకుండా కార్యరూపం దాల్చడము ద్వారానూ- నీ బుద్ధిను ఉపయోగించి నీవు ఇచ్చే ట్రీటుమెంట్లు ఫలించడము ద్వారానూ నీవు అభివృద్ధి పొందినావు అనడాన్ని తెలియజేస్తుంది (మ.లె. సం.1. పుట. 251).

2. నీవు శక్తిని సంపాదించి వ్యాధులకు ట్రీట్‌మెంట్ ఇస్తే అవి నయము అవుతాయి. అదే నీవు అభివృద్ధిని పొందినావు అనడానికి గుర్తు. కాబట్టి ముందుగా కర్మ వ్యాధులకు ట్రీటుమెంటు ఇచ్చేది. అది ఎప్పుడంటే నీవు సంపూర్ణమైన శక్తిని సంపాదించినప్పుడు అన్ని వ్యాధులు తగ్గిపోతాయి. ఇదే నీవు అభివృద్ధి పొందిన దానికి గుర్తు(మ.లె. పు. 262-263).

మనం 'మాస్టరుగారి' దయవల్ల అభివృద్ధిని పొంది 'హింటింగ్ బోర్ సైట్' ను సంపాదించి పైపైకి అభివృద్ధిని పొందవచ్చు.

## 16. కోరప్సలు-రెగ్యులేషన్సు-ఒలిడియరం-ఈక్వనాక్సు ఇంకా బ్రీతింగ్ ప్రిన్సిపల్సు ఈ రోజులలో అవసరమా?

పైవి ఏవీ నేడు మనము చేయవలసిన పనిలేదు. ఎందుచేతనంటే సృష్టికర్త ఒక్కొక్క కోర్సు ఎన్ని పర్యాయాలు కాస్మాస్ లోనికి వైబ్రేట్ చేయమని ఆజ్ఞాపించినారో ఆ ఆజ్ఞప్రకారం మాస్టరు సి.వి.వి. గారు, ఆయన మీడియములు వైబ్రేట్ చేసినారు. ఈ విషయం మాస్టరుగారు నోట్సులలో వ్రాసివున్నారు.

1. వర్కింగు పూర్తి అయింది. ఫలితాన్ని ప్రకటించడానికి సమయం కోసం వేచి వున్నది. ఇందులో ఏవిధమైన సందేహమూ లేదు. (నోట్సు వాల్యుం.2. పుట.36. తేది.7.11.1920)
2. ఇంకొకచోట-
   - అ. ప్రాక్టీసుకు ఇచ్చిన పేర్లు ఇవ్వడము పూర్తి చేసినారు-మాస్టరు సి.వి.వి. మరియు ఎమ్.టి.ఎ.
   - ఆ. మీడియముల ద్వారా తెలుసుకోవడము.
   - ఇ. నేరుగా తెలుసుకోవడము.

ఆ,ఇ ఇకపై పనిచేయాలి. (నోట్సు వాల్యుం.4. తేది.11.2.1922)

కాబట్టి ఈరోజులలో పైవాటిని వల్లించవలసిన పనిలేదు. పై విషయాలు తెలియకుండా కొందరు అజ్ఞానంతో చేస్తున్నారు. ఇతరులచేత చేయిస్తున్నారు. ఇవి వల్లించడముచేత మీకు ఒరిగేదేమీ లేదు.

మాస్టరుగారి రూల్సు ప్రకారం మీరు ప్రార్థన చేయవలసినది "మాస్టరు సి.వి.వి." అని మాత్రమే. దానికి ముందుగాని, వెనుకగానీ ఏవిధమైన పేర్లు కలుపరాదు.

ఈక్వనాక్సు ప్రేయరు మాస్టరుగారు చేయలేదు, ఇతరులకు ఇవ్వలేదు. అక్రమంగా అజ్ఞానులు కొందరు చేస్తునారు. చేయిస్తున్నారు.

1. మాస్టరుగారు 'వారు,వారు ఇంతకు పూర్వపు జన్మల్లో పొందిన అభివృద్ధిని బట్టి వాళ్ళ వాళ్ళ క్లాసులకు తగిన విధంగా కోర్సులు ఇచ్చి, పైపైకి ఎదిగించినాను' అన్నారు (డై. 373)

మనం ఎక్కడున్నామో తెలియనివాళ్ళు కోర్సులు ఇవ్వడవము చేత ఈరోజుల్లో వాళ్ళుగానీ, మీరుగానీ సాధించేది ఏమీ లేదు.

1. ఎమ్.టి.ఎ. మాస్టరుగారికి ఏమిచెప్పిందంటే 'నీ వ్యక్తిగత అభివృద్ధికి మాస్టర్ సి.వి.వి.' అని ప్రార్ధించేది; అని.(చూ.డై.పు. 50)
2. ఇకపై మీడియములకు ప్రాక్టీసుకు గాను ఇచ్చేది ఏమీలేదు. అయితే ఉదయము, సాయంత్రము మీడియములందరూ సత్యం వెల్లడి అయ్యేవరకు 'మాస్టరు సి.వి.వి.' అని ప్రార్థన చేసేది. అన్నారు ఎమ్.టి.ఎ. తేదీ.30.11.1920
3. 8.5.1910 నుండి సి.వి.వి.గారు జీవించి ఉన్నంత వరకు అందరి మీడియములకు ప్రార్ధన 'మాస్టరు సి.వి.వి. నమస్కారము' అనే ఇచ్చినారు. సి.వి.వి.గారు మీడియములకు ఇచ్చిన 'ఇనిసియేషన్ కార్డు' ను చూడండి.

## 17. ముఖ్యమైన సూచనలు.

1. ఈ రూల్సు అంతా 10 సంవత్సరాలు ప్రార్థన చేసి, అభివృద్ధి పొంది, రోగాలు పోగొట్టుకొని, ఎటర్నటీ పొందాలనుకొనే వారికి మాత్రమే

వర్తిస్తాయి. అతడు అభివృద్ధిని పొందితే ఇతరుల వ్యాధులను పోగొట్టే శక్తిని మాస్టరుగారు అతనికి ప్రసాదిస్తారు.

2. డాక్టర్లచేత నయముకాని వ్యాధులతో బాధపడేవారు కూడా భక్తి-శ్రద్ధలతో, అత్యంత విశ్వాసంతో, అతిజాగ్రత్తగా, పరిశుద్ధమైన మనస్సుతో ప్రార్థిస్తే అటువంటి వారికి కూడా మాస్టరుగారు వెంటనే రోగాలు పోగొట్టుతారు.

3. ఇంతకు ముందు చెప్పిన త్రాగుబోతుతనం వగైరా చెడ్డగుణాలు కలవాళ్ళు తమ తప్పిదాలను క్షమించి తమకు కూడా ఆరోగ్యాన్ని కలిగించమని, ఇకపై ఇటువంటి తప్పిదాలు చేయమని వ్రాసి, సంతకంచేసి, 'మాస్టరుగారి' ఫోటో వెనుకగానీ, పాదాల ముందు గానీ ఉంచి ప్రార్థించేది. ఫోటో లేకపోతే ప్రార్థన చేసే రూములో టేబులుపై ఉత్తరాన్ని ఉంచి ప్రార్థిస్తే వారిని కూడా క్షమించి మాస్టరుగారు రోగాలు, కష్టాలు తొలగిస్తారు. (డైరి నుండి)

## 18. హెచ్చరిక

అందరు యోగసాధకులు ఉదార హృదయులుగా-ప్రేమ,దయ కలవారుగా-అందరు ఒకే అభిప్రాయంతో ఉండాలన్నారు ఎమ్.టి.ఎ.

ఈ యోగంలో థాట్‌పవరు అతిముఖ్యము. ఇంకా అంతరాత్మ పరిశీలన అంతకంటే ముఖ్యం. ఈరెండూ లేక ప్రార్థించేవారు ఏమీ సాధించలేరు.

అ. మీలో పేరుకొని పోయిన తప్పుడు భావాలను పారద్రోలండి. మాస్టరుగారి రూల్సు-రెగ్యులేషన్సు ప్రకారము ప్రార్థించండి. అంటే ఏకాగ్రతతో అంతరాత్మ పరిశీలన చేస్తూ ప్రార్థించి అభివృద్ధిని పొంది మృత్యువు ను జయించండి. (ఎమ్.టి.ఎ.)

ఆ. ఆలోచించండి. మీరు వెదజల్లే పదాలన్నీ మీకు

మగతను కల్గిస్తాయే తప్ప ఫలితాన్ని ఇవ్వవు.

(చూ.డై.పు.435. తే.20.6.1921)

ఇ. శబ్దాలతో మీరు సంతోషించరాదు. అయితే మీరు శాశ్వతతత్వాన్ని నిరూపించే విధంగా ఉండాలి.

(డై.పు.441, తే.20.11.1921)

ఈ. ఎమ్.టి.ఎ. గారి ఉత్తరువు ప్రకారము. తక్కువపడిన శబ్దాలన్నీ వెదజల్లి పూర్తిచేయడమైనది.

(డై.పు.408, తే.26.9.1920)

ఉ. శబ్దాలు వెదజల్లడము చేత మీకు ఏమీ ఒరగదు, జరగదు. సంతోషించకండి.(ఎమ్.టి.ఎ)

వెంటనే కోర్సులు, రెగ్యులేషన్సు మానివేయమని కోరుతున్నాము.

అసమర్థులు-అభివృద్ధిని పొందనివారు, మాస్టరు గారి రూల్సు-రెగ్యులేషన్సు తెలియని అహంకారుల మాటలకు విలువ ఇవ్వకండి. వాళ్ళ మాటలు విన్నట్లయితే ఏ విధమైన అభివృద్ధినీ పొందలేరు. మీకు కలిగిన కష్టాలనం, రోగాలనం పోగొట్టుకోలేరు. మీ కష్టాలనం, రోగాలనం పోగొట్టుకోలేని మీరు ఇతరుల కష్టాలు, రోగాలు ఎట్లా పోగొట్టగలరు? మాస్టరుగారు చెప్పినట్లు చావు నుండి ఎట్లా తప్పించుకోగలరు?

అ. సూచనలన్నీ తీయగా వినడానికి కాదు. ఆచరించడానికి

(మ.లె. పుట.527)

ఆ. సొసైటీ రూల్సు,రెగ్యులేషన్సుకు విరుద్ధంగా ఎవరూ తమ సొంత అభిప్రాయాలను నాయోగానికి అంటగట్ట రాదు. ఎమ్.టి.ఎ. (మ.లె.పుట 635).

ఇ. నాయోగానికి నా అభిప్రాయాలు కావాలి కాని, ఇతరుల అభిప్రాయాలు నాకు అవసరము లేదు.

(డైరి.పు.222)

ఈ. సాధకులను తప్పుదోవ పట్టించడానికి నీకు, నేను అధికారం ఇవ్వలేదు. నీ అభిప్రాయాలు చెప్పడానికి నీకు అధికారం ఇవ్వలేదు.

ఎమ్.టి.ఎ. (మ.లె.పు.264).

పై విషయాలన్నీ మాస్టరు సి.వి.వి. గారికి ఎమ్.టి.ఎ.గారు తెలియజేసినవి. 'ఏమీ మార్పు చేయడానికిగానీ-సాధకులను తప్పుత్రోవ పట్టించడానికి గానీ సి.వి.వి. గారికే అధికారము లేద' ని 'ఎమ్.టి.ఎ.' తెలిపెను.

మాస్టరు సి.వి.వి. గారి డైరీలు చూడండి. అందులో వారి వద్ద చేరిన మీడియములకు అందరికీ అన్ని కోర్సులు, రెగ్యులేషన్సు ఇవ్వలేదు. వారు, వారు పూర్వజన్మలో పొందిన అభివృద్ధిని చూచి, పైపై కోర్సులు, రెగ్యులేషన్సును ఇచ్చి అభివృద్ధి పరచినట్లు తెలుస్తూంది. ''పూర్వజన్మలో ఒక్కొక్కరు కొన్ని రకాలైన పాపాలు చేసి ఇప్పుడు జన్మకు వచ్చినారు. అందుచేత అందరి శరీరతత్వాలు ఒకేరకంగా ఉండవు, కాబట్టి అందరికీ అన్ని కోర్సులు ఇవ్వలేదు'' అన్నారు. (చూ. డెయిరి. పుట.11.)

ఎమ్.టి.ఎ. చెప్పిన రూల్సు-రెగ్యులేషన్సు తెలియక ఇప్పుడు ఎదుగు, బొదుగులేని కొందరు మూర్ఖులు గుడ్డిగా మా మాస్టరు ఇట్లా చెప్పినారు, అట్లా చెప్పినారు అని సాధకులను తప్పుత్రోవ పట్టించి, మహాపాతకాన్ని ఒడిగట్టు కుంటున్నారు. వీళ్ళు మాస్టర్లని చెప్పుకొని వారే తప్పుచేసినారు. రూల్సును అతిక్రమించినారు. పాపాలు మూట కట్టుకొన్నారు. తప్పుత్రోవ పట్టించే వారి మాటలు విని మీరు, వారు చెప్పినట్లు చేస్తే మీరూ పాపాలు మూట కట్టుకుంటారు. మూట కట్టుకున్న పాపాలతో చస్తారు-మరలా పుట్టుతారు-చస్తారు. కానీ, ఎటర్నటీ సంపాదించలేరు-లేరు-లేరు. జాగ్రత్తగా ఉండండి. ఈయోగంలో

మాస్టరంటే 'సి.వి.వి.' గారు ఒక్కరేనని 'ఎమ్.టి.ఎ.' చెప్పినారు. ఎంత కొమ్ములు తిరిగిన వారైనా ఈయోగంలో మాస్టర ని చెప్పుకోవడానికి అర్హతలేదు. వాళ్ళు స్టేషన్ మాస్టర్లో, స్కూలు మాస్టర్లో మాత్రమే అవుతారు.

కట్టకడపట ఎమ్.టి.ఎ. ఏమన్నారో చూడండి.

''నా రూల్సు-రెగ్యులేషన్సును పాటించనివారు వెంటనే రాజీనామా చేసి యోగాస్కూలు వదలి, వాళ్ళ-వాళ్ళ ఇళ్ళకు వెళ్ళిపొండి''. అని తీవ్రంగా మందలించినారు

(మ.లె.పు.551).

ఎమ్.టి.ఎ. రూల్సు-రెగ్యులేషన్సును తిరస్కరించేదానికి మాస్టరు సి.వి.వి. గారికే అధికారము లేనప్పుడు, ఎవరి గురువులకూ ఏమీ అధికారము లేదు. ఉంది అనుకొంటే అది దురహంకారమే అవుతుంది.

1. ''కోర్సులు వగైరాలు చేసేవారికి లైఫ్ గారంటి సస్పెండు చేసినాను.'' అన్నారు మహాత్మా. చూ.డైరి.
2. ''మాస్టరుగారి రూల్సును-రెగ్యులేషన్సును లెఖ్ఖ చేయకుండా నీ. ఇష్టప్రకారము ప్రార్థనచేస్తే నీకు ఎటర్నటీ రాదు.'' అన్నారు. చూ.డిసొబీడియన్సు కెనాట్ బి టాలరేటెడ్.

కట్ట కడపట ప్రశాంతంగా ఆలోచించండి. నూతుల్లో కప్పల్లాగా కోర్సులపేర్లు అరుస్తూ జన్మలెత్తుతూ,చస్తూ నరకంలో శాశ్వతంగా ఉంటారో, మాస్టరుగారి రూల్సు-రెగ్యులేషన్సు ప్రకారము 'మాస్టర్ సి.వి.వి. నమస్కారము' అని ప్రార్థన చేసి అభివృద్ధిని పొంది మాస్టరుగారు ఆశించిన ఎటర్నటీ మరుజన్మలో కాకుండా ఈజన్మలో ఈ శరీరంతోనే పొంది సుఖ-సంతోషాలతో జీవిస్తారో తేల్చుకోండి.

## 19. సి.వి.వి. గారి సాహిత్యము. ఆంగ్లము

| | |
|---|---|
| 1. మాస్టరు నోట్సు సంపు.1 | రూ.25.00 |
| 2. మాస్టరు నోట్సు సంపు.2 | రూ.25.00 |
| 3. మాస్టరు నోట్సు సంపు.3 | రూ.25.00 |
| 4. మాస్టరు నోట్సు సంపు.4 | రూ.100.00 |

(పెద్దపీఠికతో)

| | |
|---|---|
| 5. ప్లానటరి లీడింగ్ నోట్సు | రూ.25.00 |
| 6. మాస్టరుగారి డైరి | రూ. 150.00 |
| 7. మహాత్మా లెటర్సు సం:1 | రూ.100.00 |
| 8. మహాత్మా లెటర్సు సం:2 | రూ.100.00 |
| 9. మహాత్మా లెటర్సు సం:3 | రూ.150.00 |

తెలుగు. శ్రీశాస్త్రిగారివి.

| | |
|---|---|
| 1. ప్రజ్ఞా ప్రభాకరము | రూ.20.00 |
| 2. ప్రవచనాలు | రూ.20.00 |

సీ.సా. రచన

| | |
|---|---|
| భృక్త రహిత తారక రాజయోగము (ప్రశ్నలు-సమాధానాలు) | రూ.50.00 |
| భృక్త రహిత తారక రాజయోగము (బుక్‌లెట్(తెలుగు, తమిళం, కన్నడ, హిందీ, ఇంగ్లీషు)) | రూ.10.00 |

## 20. కాపీరైట్సు(హక్కులు):-

మార్పులు, చేర్పులూ లేకుండా ఇవ్వవచ్చు. ఈ రూల్సుకు వ్యతిరేకంగా ఎవరూ చేయరాదు.

పై విషయాలన్నీ మాస్టరు సి.వి.వి.గారు వ్రాసిపెట్టిన సాహిత్యం ఆధారంగా రచించినవి.

## 21. సి.వి.వి. అనే మూడక్షరాల గొప్పతనమేమి?

1. నమ్మకముతో, అత్యంత విశ్వాసంతో–భక్తితో అతని జీవితాన్ని, అతని కుటుంబ జీవితాన్ని ఎవరైతే ఈ యోగానికి అంకితము చేస్తారో మాస్టరుగారి ఆజ్ఞ ప్రకారము నడుచుకుంటారో అతనిని, అతని కుటుంబాన్ని 'డైరెక్టు ఆరిజన్ లైన్' రక్షిస్తుంది.
2. 10 సంవత్సరాల లోపల ఆరా పంచగల శక్తి వస్తుంది. అతని మెదడులో ''లైఫ్ యాక్టివిటీ ఫ్లో'' పనిచేస్తుంది. ఆ శక్తి పెరిగే కొలది అతడు ట్రీట్‌మెంట్లు ఇవ్వడానికి ఆ శక్తిని ఉపయోగించ గలడు.
3. మాస్టరు ఏపని చెప్పినా, ఎప్పుడైనా, ఎక్కడికైనా వెళ్ళి నేను చెప్పినట్లు చేస్తాను–అనే దృఢనిశ్చయం తో ప్రమాణము చేయాలి. అతని సౌకర్యాన్ని, అధికారాన్ని, మర్యాదను, నష్టాన్ని లెఖ్ఖ చేయనని ప్రమాణము చేయాలి.
4. ఇటువంటి అభివృద్ది సి.వి.వి. అని ప్రార్ధన చేస్తే ఒక సంవత్సరము ఆరునెలల్లో ఎంత కలుగుతుందో గమనించాలి.
5. సి.వి.వి. అనిచెప్పి చేసే ప్రార్ధన చీకటిరూములో చేయాలి. శరీరములో విపరీతమైన వర్కింగు జరుగుతుంది. ఎన్నోరకాలైన పొశ్చర్సు (భంగిమలు) వస్తాయి. గమనించాలి.
6. పాతమీడియములలో 'సైట్' అంటే దివ్యదృష్టి కలవారిని కొంతమందిని ఈ సి.వి.వి. అని ప్రార్ధన చేసి అభివృద్ధి పొందడానికి ఎన్నుకోబోతున్నాను. అయితే ఈ ప్రార్ధనచేసే వారికి ఒక విధమైన

మగత ప్రార్థన సమయములోగాని, ఆ తరువాతగాని శరీరము అదుపులో పెట్టుకోలేనంత కలుగుతుంది. 45రోజులకు ఒక పర్యాయము వారి 'బ్రీతింగ్' లో మార్పు వస్తుంది. గమనించేది.

7. స్థూలకాయులు దీనికి పనికిరారు. వాళ్ళు అభివృద్ధి పొందితే ట్రీట్‌మెంట్లు ఇచ్చే శక్తిని ఇస్తాను. ఆ ట్రీట్‌మెంట్లు ఫలించేటట్లుగా ఉంటాయి.

8. అయితే ఈ విధంగా సి.వి.వి. అని ప్రార్థనచేసి అభివృద్ధి ని పొందే మీడియమును ఎన్నుకోవడము చాలా కష్టముతో కూడుకొన్న పని. సెలక్టు చేసిన తరువాత సూచనలు ఇస్తాను.

11.10 ఎ.ఎమ్.
ఎం.టి.ఎ. 15-11-1915

అందుచేత కోర్సులు వగైరాలు నూతుల్లో కప్పల్లాగా అరవ వలసిన పనిలేదు. అసమర్థులు-అభివృద్ధి పొందనివారి మాటలను నమ్మకండి. మీరు వారిమాటలు నమ్మితే మాస్టరుగారు ఎదురుచూచే ఎటర్నటీని సంపాదించలేరు. మీరు నరకంలో పడ్తారు జాగ్రత్త.

# గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్రప్రదేశ్ కృష్ణాజిల్లా పెదకళ్ళేపల్లెలో 07.02.1888 వ సంవత్సరము సర్వజిన్మాఘ బహుళ ఏకాదశి జ్యేష్ఠ నాల్గవ పాదమున మధ్యాహ్నము సుమారు గం॥12.10 నిముషములకు జన్మించినారు.

ఈయన ఎన్నో వ్యాధులతో బాధపడ్డారు. ఆనాడు మదరాసులో ప్రసిద్ధులైన ఆంగ్ల, ఆయుర్వేద వైద్యుల చికిత్స పొందినారు. కాని ఫలితము కనిపించలేదు. కడపట ఇట్లా నిశ్చయించుకొన్నారు.

''ఇంటికి మరల వెళ్ళుట బ్రతికియుండియు జచ్చుట యగును. చేతనున్న సొమ్ముతో హరిద్వారమునకు టికెట్టు తీసుకొని(టికెట్టుకే చాలినంత ధనమున్నది కాన) మార్గమున నుపవాసమే చేసి ఏదేని యాహార మెవ్వరి వలననేని యయాచితముగా లభించిన, ఆరగించి మహాప్రస్థాన కల్పముగా బోయి గంగానదీ ప్రవాహములో గలయుదునుగా కని నిశ్చయించుకొంటిని.'' అన్నారు.

ఒకరోజు మా గురుదేవులు(శ్రీ అబ్బూరి జగన్నాథరావుగారి బావగారైన) శ్రీ పోతరాజు నరసింహంపంతులుగారు(మీడియము నెం.123భృ.ర.తా.రాజయోగం లో చేరిన తేది.30.1.1914) ఆకస్మికముగా శ్రీ శాస్త్రిగారిని కలిసి, వారి అనారోగ్యము తెలుసుకొని వెంటనే శ్రీ మాస్టరు సి.వి.వి. గారికి ఉత్తరవము వ్రాసి ఇచ్చిరి. ఆ ఉత్తరవముతో ఆనాటి సాయంకాలమే కుంభకోణము ప్రయాణము. రైల్లో ఇట్లు అనిపించినది.

''హరిద్వారము గాక ఆరోగ్యద్వారము చేరబోవు చున్నట్లయ్యెను.''

ఉదయము శ్రీ సి.వి.వి. గారిని దర్శించిరి వారు. సి.వి.వి. గారిని వర్ణించిన తీరు ఇది 22.6.1916.

'లావుగాక,సన్నముగాక, పొట్టిగాక మఱీ పొడుగుగాక నిమ్మపంటి ఛాయతో అరుణోదయ కాంతులు కడల్కొల్పుచున్న శ్రీవారి'ని జూడగానే నా యొడలు పులకరించెను. కేలుదోయి మోడ్చి, నమస్కరించి, జాబు నర్పించుకొంటిని. చదివి, నవ్వి 'స్నానాదికము గావించి విశ్రాంతిగొను' మనిరి.

శ్రీవారితో నాస్థితిని విన్నవింపగా 'ఇక నీయారోగ్య రక్షణ భారము నేను వహించితిని. వెఱవక నలువురితో పాటుగా మామూలు భోజనము చేయవచ్చును. దానివల్ల నీకేమీ చెఱుపురాదు' అనిరి.

నాటి సాయంకాలము ఆఱు గంటలకు నాకు శ్రీవారి శిష్యతా నుగ్రహము లభించెను.(యోగములో చేరిన తేది 22.6.1916. మీడియము సంఖ్య 330.)

శ్రీవారికి సాష్టాంగముగా నమస్కరించి నాయభ్యర్థనము నివేదించుకొంటిని. ఉపదేశము చేసిరి. వెంటనే "నీవు హాలులోనికి వెళ్ళి, ప్రేతాసనమున శయనించి, నమస్కరించి, ఉపదిష్టము నొక్కమారే యుచ్చరించి, కనులు మూసుకొని, శరీరము లోతట్టున నేమేని జరుగును గనుక దానిని గుర్తించు చుండుము. మనస్సు బహిర్ముఖమై ఎక్కడికేని పోయినచో పోనిమ్ము. నీవై యరికట్ట వలదు. అదే తిరిగి రాగలదు. ఏమి జరుగునో సాక్షి మాత్రుడవై పరికింప దలపుగొనుము. అంతే నీవు చేయవలసినది. కొన్ని నిమిషములదాక కనులు తెఱవ ప్రయత్నింపకుము. ప్రయత్నించినను దెఱవ వీలుపడదు. మరల మూసుకొనియే పోవును. శరీరములోనప్పుడు జరగవలసినదెల్ల జరగగానే కన్నులు తెఱపి యగును. అటుపై కనులు మూసుకొని పండుకొనుట కష్టమనిపించును'

అట్లే ఉపదిష్టము నొక్కమారే సార్థకముగా స్మరించి యుచ్చరించి కనులు మూసుకొని పండుకొంటిని.

తోడ్తో నాలో నేదో గొప్ప ప్రజ్ఞ ప్రవేశించి యూగించి పైచుచున్నట్లు గోచరింప దొడగెను. ఉత్సాహ వినోదములతో దానినే పరిశీలింప దొడగితిని. 'ప్రజ్ఞ యనియో ఇంకేమనియో నిర్దేశింపదగిన యపూర్వానుభూతి ప్రవేశము నాలో విజృంభింప దొడగెను. అది యెక్కడ నారంభించినది, ఏమి జరుపుచున్నదియని వెదక దొడగితిని. అది శరీర చర్మం లోతట్టుదాక వ్యాపించుచున్నట్టు తొలుత నెక్కడ నుపక్రమించినదో గుర్తుపట్ట సాధ్యము కానట్టుండెను. శరీరములో నేదో గొప్ప క్రొత్త ఇంజన్ పనిచేయు చున్నట్లయ్యెను. నా మనస్సానందోత్సాహములతో నలలు వాఱుచుండెను.

నేను శ్రీవారి సన్నిధి కరిగి జరిగినదంతయు దెల్పికొంటిని. వారు చిరునవ్వు మోమున వెలార్చి 'తనివితో నుండు' మని యాదేశించిరి.

మర్నాడుదయమున లేచి కాలకృత్యములు దీర్చుకొని యోగానుభూతికి సిద్ధముగా నుంటిని. పూర్వదినపు సాయంకాలమున నాయూరిలోని వారనేకులు యోగసాధనమునకు వచ్చిరి. వారెల్ల నాయుదయముననను వచ్చి యుండిరి.

రాధాకృష్ణ పిళ్ళయని, మహదేవయ్యరు అని యిద్దఱు ప్రధాన శిష్యులుండిరి. వారు నా విషయమును శ్రీ వారికి విన్నవించిరి. అప్పుడు నా విషయము 'టెస్టు' తీయవలసినదిగా వారు వారి కాజ్ఞాపించిరి.

ఉదయము సరిగా తొమ్మిది గంటల పదినేడు నిముషముల వేళ కది వ్రాయ నారంభించిరి. పిళ్ళగారు కనులు మూసికొన్నప్పుడు అంతర దృష్టికి కనుపడినవి, అంతరశ్రుతికి వినబడినవి చెప్పదొడగిరి. అప్పుడు నా శరీరాంతర్భాగమున గల స్వాస్థ్యాస్వాస్థ్యములు, నా మనోభావములు, నా అనారోగ్య కారణములు, తన్నివార ణోపాయములు, అప్పటికి జరిగిన పూర్వజన్మములు మొదలగునవి కలవు. అది యెల్ల ముగిసిన పిదప దానిని శ్రీవారి చెంతకు గొనిపోయి వినిపించిరి. వారిసమ్మతిమీద దానిని రికార్డు చేసిరి. ఆ కాలమున యోగాభ్యాసమునకు వచ్చి శిష్యతను బొందు వారి

కందఱకు నట్టి టెస్టు తీయుట జరుగు చుండెడిది. నన్ను గూర్చి వచ్చిన రికార్డును కాపి కోరితిని. శ్రీవారి సమ్మతితో నాకిచ్చిరి. అది నా దగ్గఱనున్నది.

భోజనానంతరమున నే జేర నరిగి సాష్టాంగ నమస్కారము చేసి ఇట్లు విన్నవించు కొంటిని 'మూడేండ్ల నుండి యమబాధ పడుచున్నాను. నిద్ర లేదు. శాంతి లేదు. ఆకలి, జీర్ణించుకొను శక్తి సరిగా లేవు. ఇక్కడికి రాక తలపునకు నందబోవుననగా నా యెఱుకకు తెలియకుండనే సరిగా భోజనము చేయ గల్గితిని. మీ యోగ మహాత్మ్యము శ్రీ నరసింహముగారి ద్వారా విన్నంతనే నాలో నేదో దివ్య సౌఖ్య సాధమునకు బాట గోచరించు చున్నట్లయినది. ప్రశాంతముగా రాగలిగితిని.

పూర్వము తీవ్రమయిన మందులు పుచ్చుకొంటిని. తదాది కడుపు ఉడికి పోవుచున్నట్లుండును. నేడదిలేదు.

నేనిక్కడ మీ సేవకుడనుగానే ఉండగోరు చున్నాను.

వారు నీకిప్పుడు 'జీతమెంత?' అని యడిగిరి. 'ఏబది రూపాయ' లంటిని. 'దీనితో నీవు నీ కుటుంబమును పోషించు కోవచ్చును. ఉన్న జీవికను మానుకొని ఇక్కడ నుండనేల?

బండి నడుచుచుండగనే రిపేరు సాగవలెను. బండి ఊడదీసి చేయుచో బండివాని జీవిక చెడును. అట్టిది నా యోగమార్గము. సాగుచున్న ప్రవృత్తికి భంగము కలుగరాదు. ఇది నివృత్తి మార్గము కాదు. రాజయోగ మార్గము. గార్హస్థ్యము ఉండవలెను. సన్యాసి కారాదు. సౌఖ్యముండవలెను. ఆహారాదులు సరిగా పసిగా కయుకొనుచుండ వలెను.

అట్టిచో నీవు నీ యుద్యోగమున నుండుటావశ్యకము. నీ యుద్యోగము నీ జీవికకే కాక లోకమునకు గూడ నుపకారకము.

నీవిక్కడ నుండ గోరుట నా సన్నిధి లాభము కొఱకే కదా! నేను సదా నీలో నుందును. నీకు వలసిన సహాయము నీలో నుండి జరుపుచునే

యుందును. ఇక్కడ నీకే తీరున శరీరమున సంస్కారము జరుగుట గుర్తుకు వచ్చెనో, ఆ తీరుననే యెక్కడనున్నను అనుభూతి గుర్తుకు రాగలదు. ఉదయము జరిపిన యోగసాధనము శరీరమున సాయంకాలముదాక పనిచేయుచునే యుండును. ఎప్పుడెప్పు డెంతెంత జరగవలెనో అంతంత జరుగును.

నీలోని సంస్కారము జరపునది ప్రజ్ఞాకలితమైన చైతన్యముగాని జఢశక్తి కాదు. అది యెలక్ట్రిసిటీ వలె పనిచేయునది కాదు. ఎలక్ట్రిసిటీ హద్దు దాటి అక్రమముగా నుపయోగించినచో కీడు తేగలదు. నీలో నిప్పుడు క్రొత్తగా ప్రవేశించిన ప్రజ్ఞ నీవధికముగా నుపయోగించు కోగోరినను అది యట్లు పనిచేయదు. ఎంత చేయవలెనో అంతే చేయును. కావలెనన్నను నీవావశ్యకత కెక్కువగా కనులు మూసుకొని యుండజాలవు. లోపల నావశ్యకమయిన పని జరుగుచుండగా కనులు తెఅవను జాలవు.

ప్రయాణవములో, రైలులో, బండిలో, నడకలో ఇంకేవేని వ్యవహారములలో వర్తిల్ల వలసి వచ్చినప్పుడు సరియయిన వేళ తప్పి పోకుండ ఒక క్షణమాత్రము మనసున స్మరించిన జాలును. కార్యాంతరములు తీరి విశ్రాంతి దొరకి నప్పుడు జరగ వలసిన సాధన మెల్ల జరగ గలదు.

వివేకమును సత్యమును ధర్మమును గుర్తించుకొనుచు నంతరాత్మ నారాధించుచు లోలో జొచ్చు కొలదిని నీకు వలసిన యుద్భోధములు లభింప గలవు. అట్టి యుద్భోధములను నీవు నీలో నెక్కడ నుండి యెట్లు పడయు చుంటివో క్రమ క్రమముగా తెలిసికొన గలవు. ముందు నీ దృష్టి ఆరోగ్య లాభమున ప్రసరించుచున్నది.

నీవు పరమార్థ కుతూహలిగా నుండిన జాలును. యోగసాధనమును ఆకలిగొన్న రిత్తకడుపుతో నుండి చేయరాదు. ఏదే నాహారము గొన్న పిదపనే చేయవలెను'' అనిరి.

కొంత కాలమయిన తర్వాత నేను మరల కుంభకోణము వెళ్ళియుండగా శ్రీవారే నేనడగకుండానే యీ విషయమును గూర్చి యిట్లనిరి.

'నాకు శిష్యులుగా నుండు వారెవరు గాని లోకమునకు విడ్డూరముగా తోచదగిన వేషభాషలతో నుండుట బాగు గాదు. నలుగురతో పాటుగానే యుండ వలెను. ఈ యోగమున నెవడుగానీ ప్రత్యేకముగా కడతేర జాలడు. తాను, తన చుట్టుపట్టుల వారు, తన యాప్తులున నుక్రమమున ప్రేమ వ్యాపకమగు తీరు ననుసరించి తాను, తన చుట్టుపట్టుల వారు, తన యాప్తులున నుక్రమముగా లోకము నంతను ప్రేమించి లోకము నంతను గడతేర్చువాడు కావలె. తన ప్రేమ సర్వలోక వ్యాపకము గానంత వఱకు నెవ్వడుగాని కడతేర జాలడు. అఖండము, సర్వ వ్యాపకమునగు తత్త్వమును బడయుటకు తాను నఖండుడు, సర్వవ్యాపకుడు కాక తప్పదు. దేశ, కుల, జాతి, మతాది పరిచ్ఛేదములతో వేఱుపడిపోయి సర్వప్రజతో సామరస్యము కుదుర్చుకోలేనివాడు సంసార బంధమున కొట్టుకాడ వలసినవాడే! బహిర్ముఖముగా సాగుచున్న బహుత్త్వమును సాగనిచ్చుచునే అంతర్ముఖముగా దిరిగి అందేకత్త్వమును గుర్తించి వర్తించుట ఈ యోగ సాధనమున కొక ఫలితము. మన పరిపూర్ణత భవిష్యత్తులో నున్నది గాని భూతము కాలేదు. కనుక భూతమును పీఠికపై నెలకొని భవిష్యత్తున పరమార్థ మనుభవింప వలసి యున్నది.'

ఆ తరువాత సమయాంతరమున నిట్లు చెప్పిరి–

'మీ కేవిగాని సందేహములు తోచినచో తోచిన వానికి బదుళ్ళు యోచింపక వెంటనే వానినట్లే నాకు వ్రాయుటో, అడుగుటో చేయ వలదు. మీ చేతనయినంత వఱకు వాని సమాధానమును మీరే కనుగొన ప్రయత్నింపుడు. ఎంతకును సమాధానము దొరకని వానినే నన్నడుగుడు. న్యాయమైన, సంగతమైన ప్రశ్న మెవరికి గాని తోచినచో నాప్రశ్నపు ఘనత

ననుసరించి దానికి తగినంత యత్నము చేసినచో సరియయిన సమాధానము దొరక గలదు. ఆ యత్నము బహిర్ముఖ మగు ప్రాచీన గ్రంథాదుల వల్ల, తనకు విజ్ఞులుగా తోచు నాప్తుల వల్ల తెలియదగిన దగును. అంతర్ముఖ మగుచో ఆత్మోద్బోధ రూపక మగును. ఈ యోగముట్టి యాత్మోద్బోధమును గొల్పుటకే.

బహిర్ముఖముగా సమాధానము తెలియగోరుచో, 'అనంత శాస్త్రం బహు వేదితవ్యం' ఆ యా శాస్త్రములును, దత్ కర్తలును బహుభేదముల వారు. అందెవరిది గ్రాహ్యమో తేల్చవలసినది మరల నాత్మోద్బోధమే. 'ఘట్ట కుటీ ప్రభాత న్యాయము' న నెల్లరు నెట్లుగాని యాత్మోద్బోధముల ననువర్తింప వలసిన వారే, అనువర్తించు వారే కాక తప్పదు. బహిర్ముఖముగా లభించు విజ్ఞానమును దోడు చేసుకొని యాత్మోద్బోధముల నందుకొన గల్గినచో పరమార్థముల సులువుగా బడయ వీలుపడును.' అన్నారు.

యోగసాధనానంతరము రామ జపము వలె కొంతదడవు తదేకాను ధ్యానము చేయ బూనితిని. ఒడలెల్ల మంటలెత్తినట్లయ్యెను. అది శ్రీవారితో చెప్పితిని.

'నియత సమయములలో తక్క నితర సమయములలో నా యనుష్ఠానము చేయ రాదనియు, ఏదేని యావశ్యకత కల్గినచో నప్పుడొక క్షణము స్మరించి నంత మాత్రమున దానికి జరగ దగిన సాకర్యము జరుగు ననియు, తదేక పారాయణ చేయుటకు పరతత్త్వము చెవిటి గాదనియు, నోటి మాటను చెవి విన్నట్టే మీ యభ్యర్థనములనది విన గలదనియు, ఒక తూరి ప్రార్థించినంతనే సర్వసిద్ధముగా ననుగ్రహింపగా నది చూచు చుండగా మరల మరలనడుగుటేల యనియు' ననిరి. 'టెలిఫోనులో ఒకతూరి పిలువగా నవతలి వారు సిద్ధముగా బదులు పలుకుచుండగా

దానిని వినక యూరక పిలుపులే పిలుచు వాని తీరువంటిది పదింబదిగా స్మరించు చుండుట' యనిరి.

1925 వ సం॥ ప్రాంతముల నొక మిత్రుడు నిరంతరము శ్రీవారి స్మరణమే రామజపము వలె జరపుట సాగించెను. కొన్నాళ్ళకు శరీరమెల్ల నగ్నిజ్వాల వలె నయ్యెను.

జరపిన తప్పిదమునకు పశ్చాత్తాపము సెంది క్షమింప ప్రార్థించి సక్రమముగా నడుచుకొన సాగించిన తరువాత నారోగ్యము చక్కబడెను.

ఇంటికి వచ్చిన వారం రోజులలోనే నాకు ఆఫీసు నుండి టెలిగ్రాం వచ్చెను. 'తక్షణమే నీవు తంజావూరి లైబ్రరీ పరిశీలనమునకు వెళ్ళవలసినది. అక్కడ చేరి పనిచేయవలసినది' అని.

మద్రాసు వచ్చి ఆఫీసుకు వెళ్ళి, మద్రాసులో నాగక కుంభకోణమునకే వెళ్ళి పోయితిని.

శ్రీవారు నన్ను ప్రతివారము సెలవు దినమున తంజావూరు నుండి కుంభకోణము వచ్చుచుండు మనిరి.

ఆ కాలమున రైలు చార్జీ అర్ధరూపాయ లోపుగా నుండెను. అట్లే చేయుచుంటిని.

1916 క్రిస్మస్ సెలవులు వచ్చినవి. నేనా సెలవు రోజులలో శ్రీవారి సన్నిధి నుంటిని. 31.12.1916 న విరేచనములయ్యెను. నీరస పడితిని.

శ్రీవారికి ఈ అసందర్భము తెలిసెను. రామచంద్రయ్యరుగారు అను ముఖ్యశిష్యుని బిలిచి 'ప్రభాకరునికి విగర్ సప్లై యగుటకు ట్రీట్చేయ' మనిరి. అతడు పండుకొన్న నా దగ్గరకు వచ్చి యట్లు చేసెను. అయిదు నిముషములలో పండుకొన్న నేను లేచి కూర్చుండి, కూర్చున్న నేను లేచి, లేచిననే నిటు నటు దిరిగి, తిరిగిన నేను పర్వెత్తి గలిగి యుత్సాహ శక్తి

పూరితుడనయితిని.

శ్రీవారి పాదముల వ్రాలితిని.

రైలు వేళగుచున్నది గాన వెంటనే స్టేషనుకు పొమ్మనిరి. 'ఇక నుండి యనారోగ్యముండదు. వారము వారము రానక్కఱ లేదు. రెండు రోజులు శలవు కలసి వచ్చిన రమ్ము. పగలు హాయిగా భోజనము చేయుము. ఉదయము, మధ్యాహ్నము లఘ్వాహారము గొనుము. జీర్ణశక్తి సరిగా నుండును. లివరు సరిపడినది. రాత్రిపూట మజ్జిగ కాక పాలు పోసికొని భుజింపుము' అనిరి. తంజావూరికి వచ్చివేసితిని.

నన్ను బిలిచి శ్రీవారు 'నీవీరాత్రి నేను సదా వర్తిల్లుచుండు యోగాలయపు గదిలో, నేను విశ్రమించు బల్లమీద నీ భార్యతో శయనించుము. నేనిప్పుడు ఇంటనే శయనించు చుంటిని' అనిరి. నేను గడగడలాడి సిగ్గుతో అంగీకార సూచకముగా తల వంచితిని. కాని నాకు తర్వాత చాలా వెరపు గల్గెను. అది గురుదేవులు శయనించు గది. అందు వారు విశ్రాంతి గొను బల్ల! అందు నేను శయనించుటా? అందునూ సద్వితీయముగా! అని వణకితిని.

శ్రీవారు ఇంటిలో విశాలమయిన మండువాలో చంద్ర నక్షత్రాదులు, నీలాకాశము గోచరించుచుండగా చల్లనిగాలి వీచు చుండగా, నొక గోల్డు మెడల్ మడత మంచము మీద పలుచని పడుకపైన శయనించి యుండిరి. పడుక మీదను, క్రిందను చల్లిన మల్లెపూవు లున్నవి. పట్టు తలగడ కలదు. తెల్లని పలుచని పట్టుసెల్లా కప్పుకొని యుండిరి. మంచమునకు దోమతెర కప్పుండెను. అదను బ్రతీక్షించుచు వారు కనులు దెరచి లేవ నుంకించు నంతలో నేనం చేరనరిగి పాదవములు స్పృశించి నమస్కరించితిని. 'రాత్రి యెక్కడ శయనించితివ' ని యడిగిరి. ఇంటిలో స్త్రీలతో స్త్రీయు, వాకిటి యరుగు మీద నేనును

శయనించుట తెల్పితిని. చప్పరించి 'నామాట పాటింపక పోతివిగదా!' యనిరి. సిగ్గుతో తల వంచితిని. 'సరే! కానిలే! ఏమి విశేషము?' అనిరి.

'మా తల్లిదండ్రులు వృద్ధులు. ఎప్పుడేమి జరుగునో? వారికి మీ శిష్యత ననుగ్రహింప వేడుచున్నాను. వారిక్కడికి రాజాలరు.' అంటిని. 'వారి వయసెంత?' యనిరి. 'మా తండ్రిగారి వయసు డెబ్బది దాటినది' యంటిని. 'అంత వార్ధక్యముననున్న వారిని గూర్చి యను తపింతువే? చిరకాలము నీతో జీవితము గడపవలసిన నీ భార్యను గూర్చి యడుగవేమి?' యనిరి.

'సరే కాని నేడు ఎనిమిది గంటలకు నీభార్యకు ఇన్సియేషన్ జరుగును. అందుకు వలయు సన్నాహములు జరపుము. ఫారము వగైరాలు ఫిలప్పు చేయించుము' అని శయ్య వీడి లోనికరిగిరి.

ఎనిమిది గంటలకు ఇన్సియేషన్ జరిగినది.

మరల శ్రీవారిని దర్శించి నా కోర్కి–మా తల్లిదండ్రుల విషయమును ప్రశ్నించితిని.

ఇక వారి శరీరములను చిరకాలము రక్షింపననువు పడదు. అయినను నీవు వెంటాడుచున్నావు గాన చెప్పుచున్నాను. 'నీవు యోగసిద్ధుడవైతేని–'దశపూర్వేషాం దశాపరేషాం'– మీ వంశ్యులకు నీ యోగవాసనలంటి వారు కడతేర గలరు. పది సంవత్సరవములు విడువక నాయాదేశము చొప్పున యోగాభ్యాసము చేయవలెను. అన్ని వాంఛితవములను నీవే నెరవేర్చుకొన గల్గుదువు. ఇప్పటికి మీ తల్లి దండ్రులక్కడనే ఉండి యీ నా

యుపదేశించు విధానము నాచరింతురు గాక' అని తద్విధానము తెల్పిరి. నేనెంతో ఉప్పొంగితిని.

పంటి పదేండ్లకు గాని నేను గుర్తింప యోగ్యత గలవాడ గాజాలనయితిని. పదుమూడేండ్ల కద్భుతముగా తద్రహస్యమెల్ల ననుభూతి పూర్వకముగా గోచరించెను.

శ్రీవారు శరీరమును విడుతురనగా నాడీకారుని ప్రశ్నించిరి. 'ఉన్నది యున్నట్టే వ్రాయుట, చదువుట జరుపుచున్నావా? కల్పనలు సాగించు చున్నావా?' అని.

అతడొక కల్పన జేసెనట! 'ఎప్పుడు గాని యిట్లు మార్ప పలద' ని శ్రీవారు శాసించిరి.

కాపీలను వశపరచుకొని కట్టకట్టి యట్టుకమీద దాచివైచిరి. ఇక నాడి చదువ వలదనిరి.

'నాడికి పరమ ప్రామాణ్యము కల్పించుకొని మీరు చదువరాదు. నా దగ్గఱకు మీరు వచ్చి శిష్యులగుట నాడి మూలమున గాదు. నాడి జూచుట మీరు నా శిష్యులయిన తర్వాతనే. ఏ కారణములతో మీరు నా శిష్యులయితిరో ఆ కారణముతోనే నన్నును వర్తింపుడు. నా మాటలు స్వతఃప్రమాణములు గాని పరతః ప్రమాణములు గావు. నన్ను, నా కార్యములను నాడి ననుసరించి విశ్వసింప వలదు.' అనిరి.

నా యోగమార్గమును పరిపూర్ణముగా గుర్తించుట ఎవరికిని సాధ్యము గాదు. అది నాకు కూడా నప్పటప్పట తెలియనగునదిగా నుండును. శాఖోప శాఖలుగా పెరుగ గల మఱ్ఱిచెట్టునకు ఎన్నాళ్ళకే దిక్కున నేశాఖనది వెలయింప గలదో తెలియ నట్టే లోక తంత్రమున, మఱి యీ యోగ తంత్రమున వికాస ముండును. మానవుడు ఈశ్వరతను చేరబోవుకాలదిని దానిని తెలియగల్గ వచ్చును. వృక్షశాస్త్రమున

గొన్ని వృక్షము లిన్నాళ్ళకిన్ని యాకులనో, శాఖలనో వెలయింప గలవనీ, యీ యీ సమయములలో బుష్పింప గలవనీ, ఫలింప గలవనీ, ఇన్ని పుష్పములనీ, ఇన్ని ఫలములనీ కూడ గుర్తించుట జరుగు చున్నది. మానవ ప్రజ్ఞ పెరుగగను పెరుగగను ఈశ్వరునకు చేరువ కానుగాను సర్వప్రాణి సృష్టి రహస్యములను మానవుడు గుర్తింప గల్గ వచ్చును. మానవత పెరుగగను పెరుగగను తద్ హృదయమున నుండి ప్రజ్ఞోద్భోధములు పెరుగ గలవు. ఇప్పుడు పెంపొందుచున్న శాస్త్రములన్నియు నట్టివే.

మానవ హృదయము నిర్దుష్టము కానంత వఱకు, మానవ వాక్కు సుపవిత్రము కానంతవఱకు, మానవ కార్యములు వినిర్మల ములు కానంత వఱకు సృష్టి రహస్యము మానవత గుర్తునకంద నేరదు. ప్రయత్నములు సాగుచున్నవి. .

మీరీ నాడీగ్రంథాదుల వెంటాడుట సాగించితిరేని మీలోని ప్రజ్ఞోద్భోధములు కుంటు పడును. ప్రజ్ఞోద్భోధముల వెంటాడుచు బాహ్యశాస్త్రాది సాధనములను విడనాడ వలెను. కడకు ఆత్మానుభూతిలో నెలకొనుట యగును. మీరు చూడ వలసినది యీ తాటాకుల నాడి గాదు. శరీరమున చైతన్యముతో ఆడుచున్న నాడి. ఈ తాటాకుల నిప్పటికిక గట్టిపెట్టి ఇందు చూపుతత్పరతను యోగసాధనముల మీద చూపుడు'' అనిరి.

## శ్రీ శాస్త్రిగారి గొప్పతనమేమి?

1. మాస్టరు సి.వి.వి.గారి చేత ఇన్సియేషన్ పొందడము.
2. శ్రీవారితో నేరుగా మాట్లాడడము.
3. సొసైటి సూపరింటెండెంటు గారైన శ్రీ ఎస్.సుందరము గారి

పర్మిషను లేకుండా సి.వి.వి. గారిని చూడడము.

4. ప్రతి ఆదివారము తంజావూరి నుండి తనవద్దకు రమ్మని సి.వి.వి.గారు ఆజ్ఞాపించడము.
5. సి.వి.వి. గారు పడుకునే బల్లపైన భార్యాసమేతముగా పడుకోమని సి.వి.వి. గారు చెప్పడము.
6. మాస్టరు సి.వి.వి. గారు సెలవిచ్చిన అమృత వాక్యాలను మనకు అందించడము.

పై అదృష్టాన్ని పొందిన ధన్యజీవి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

## కుంభకోణము వెళ్ళుటకు మార్గము:-

మదరాసు నుండి బస్సులు కుంభకోణమునకు గలవు- కుంభకోణము నకు రాగానే మళయపాలం అని చెప్పితే దించగలరు- అక్కడికి నూరు గజాలదూరంలో కీళ్ డబీర్ తెరు అని ఉన్నది-దాని మొదటనే మాస్టర్ సి.వి.వి. యోగస్కూలు-కాలేజి-యూనివర్సిటీ అనే బోర్డు ఇంగ్లీషులోను, తెలుగులోను, అరవములోనూ కలదు-ఆ ఇంటిలోని రూములోనే మాస్టరుగారు 22 సంవత్సరాలు ప్రార్థన చేసినది. రైలు ఎగ్మూరు నుండి బయలుదేరును.

కారులో వచ్చేవారు మదరాసు-చెంగల్పట్టు-దిండివనం- విళుప్పురానికి ముందే బ్రిడ్జి ఉంటుంది. దానిని దాటగానే తంజావూరు అని బోర్డు ఉంటుంది. అక్కడ ఎడమచేతివైపు తిరిగి-నైవేలి-వడలూరు- శేత్తియాతోపు మార్గముగా వచ్చేది.

ఈ బుక్‌లెట్ ఇంకా ఆంగ్లము, తమిళము, కన్నడము మరియు హిందీ భాషలలో కూడా లభిస్తుంది.



## ఇంకా ఎక్కువ వివరాలు కావాలంటే


**ఎ.వి. శ్రీనివాసాచార్యులు. (సీ.సా.)**

**మాస్టర్ సి.వి.వి. యోగ సెంటర్ బ్రాంచి**

**శ్రీ ప్రభాకర మిత్ర మండలి,**

నెం.12, రాములవారి ఉత్తర మాడ వీధి, తిరుపతి - 517 507. చిత్తూరు జిల్లా.

ఆంధ్రప్రదేశ్.-ఇండియా.

✆:+91(0)877 222 8814, వెబ్‌సైటు: www.mastercvv.org.

ఇ-మెయిలు: avsacharyulu@mastercvv.org. (or)avsacharyulu@rediffmail.com.,

webmaster@mastercvv.org



మొదటి ముద్రణ :- డిసెంబరు 2002

రెండవ ముద్రణ :- ఫిబ్రవరి 2003

మూడవ ముద్రణ :- మే 2003

# Publications

## Books

English




## Master's Diary




**Mahatma's Letters** (Vol.I ,Vol.II and Vol.III)




Master C V V Notes Volume (s) - I & II

## Master Notes (Vol. I and Vol.II)

(including Planetary Leading Notes)

# Telugu




Pragna Prabhakaramu
Sri Veturi Prabhakara Sastry

## Pragna Prabhakaramu

by Sri Veturi Prabhakara Sastry garu




Bhruktha Rahitha Tharaka Rajayogamu
(Sadakas Questions & Answers)

## Bhrukta Rahita Taraka Rajayogamu

(Sadakas Questions & Answers)

by Sri A.V.Srinivasacharyulu garu (See Saw)




Bhruktha Rahitha Tharaka Rajayogam

## Bhrukta Rahita Taraka Rajayogamu

(Broacher – Telugu, Tamil, Kanada, Hindi, English)

by Sri A.V.Srinivasacharyulu garu (See Saw)

*For Copies :*

**M. Lakshmana Murthy** (Trustee)
Mobile No. : +91 9440046226; +91 9492695350

**Sri Prabhakara Mitra Mandali**
Master C.V.V. Yoga Centre Branch
No. 7-21-S7-315, Konka Street
Near Ramulavari East Mada Street
Tirupati - 517507, Chittoor District, A.P. India

Pragnaprabhakaram Telugu 1976 Edition : Vissa Appa Rao (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

Pragna Prabhakaram In Modern Telugu : Vissa Appa Rao (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

YOGA DARSANAM Pragna Prabhakaram Padyalu By Gurudev Sri Veturi Prabhakara Sastri : Vissa Appa Rao (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

Mani Manjari 1986 08 01 Volume No 12 Issue No Xx 188 P Andhra Bharati : Appa Rao Vissa (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

eBooks of Gurudev Sri Veturi Prabhakara Sastri archive.pdf
https://archive.org/details/frontpages_201906 [Files in XPS Format] of Hindi Edition of Pragna Prabhakaram. Parts 1 to 5. 3. https://ia801601.us.archive.org/17/items/in.ernet.dli.2015.328927/2015.328927.PragnyaPrabhakaramu.pdf [Original Telugu Edition Dte.1951August] F. You Tube Videos 1. Veturi Prabhakara Sastry

PRAGNA PRABHAKARAM VOLUME 2 : Vissa Appa Rao (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

New Yoga Bhruk Rahita Taraka Raja Yoga ( English) : Vissa Appa Rao (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

Nootana Yogamu ( New Yoga) Bhruktha Rahita Taraka Yogamu : Vissa Appa Rao (Junior) : Free Download, Borrow, and Streaming : Internet Archive

https://m.facebook.com/story.php?story_fbid=10213415939646462&id=1038887427

Appa Rao Vissa - Sharing with Ravi Muthuprabhakar: Re-Renovated... | Facebook

Special on SVBC TTD Official Channel. https://youtu.be/vvHpjnOaDDY SVBC TTD Gurudev VPS with Master CVV.mp4 14th January 2013 https://youtu.be/TkJOuYsKWz0 Comment: Anandamurthy Veturi 6 years ago “I like watching this video documentary as many times as possible... Particularly during this (2/12 to 2/13) 125th Birth Anniversary Year Celebrations (1888 - 1950) of Gurudev VPS. Thanks to the TTD & SVBC”. 3. MASTER CVV HOUSE @ YOGA SCHOOL AT KUMBAKONAM https://youtu.be/HLLKWS1bzmQ 4. Veturi Prabhakara Sastri garu - YouTube https://www.youtube.com/watch?v=v6E8SgDPemY Feb 06, 2017 · Talk by Dr. Veturi Sankara Sastri, Youngest Brother of Veturi Prabhakara Sastri.

